



పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు పచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది

అమృతాంజన్ లిమిటెడ్

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే ఇంధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మాత్రమేగాని మీకు కూడా ప్రతి రోజు ఉత్సాహంగా ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతి ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకోవడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ ఇవ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు అదనంగా శక్తినిస్తుంది. ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు. బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా ఇష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి. బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఉచితమైన మార్గం—ప్రతి రోజు.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B 4575-TEL-13

# ఉత్తరాలు

## అట్టమీదబొమ్మ

19—8—77వ తేది ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖచిత్రం హిందీ నర్తకి హెలెన్ మమ్మ లను ఎంతగానో ఆకర్షించినది. మీరు ఈ మధ్య పత్రికలలో ఆడతారలముఖచిత్రాలే వేయుచున్నారు. మొగతారల విషయంలో శ్రద్ధ తీసుకోవాలి ? ఈ పత్రిక నుండి ప్రారంభించుచున్న సీరియల్ శాంతి తీరం మొదటి భాగంలోనే మమ్ములను ఆనంద పరచినది. తరువాత కథ ఏమవుతుందో పత్రికకై ఎదురు చూస్తున్నాము. కథలు చిన్నవే అయినా బాగానే ఉన్నాయి. మీ [మా] పత్రికలో పాలా క్షని డైరీ తప్పక చదవవలసినదే. పత్రిక పేజీలు పెంచి వెల పెంచితే బాగుంటుంది.

వేమాని వేంకటేశ్వరశర్మ [సింధియా]

## తెలుగులో రచనలు

మంధా వెంకటరమణారావుగారి గొప్పరచన ఒక కన్య చెప్పిన కథ చదువుతున్నాను. ఒక కన్య తన చుట్టూ జరుగుతున్న విషయాలని తన కనగాహన అయిన రీతిలో మనతో చెప్తున్నట్లుగ రచయితరచన సాగించడం ఆసక్తికరంగాను, ఆయన ప్రతిభకి





కళాప్రపూర్ణ డా. దాశరథి ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా ఆగస్టు 16 నుంచి నియమితులైనారు.

నిదర్శనంగాను ఉంది.

ఆ మధ్య ఆంధ్రసచిత్ర వారపత్రిక ఇన్ క్రెడిబుల్ గాడెస్ [డ్స్ ?] అనే మరో గొప్ప రచనని ప్రచురించింది. శక్తివంతులైన దర్శకులు, ఉత్సాహవంతులైన నిర్మాతలు తలపెడితే అంతర్జాతీయంగా ఖ్యాతి నార్జించగల చిత్రం నిర్మించడానికిగాను తెలుగులో రచనలులేవు అన్నది ఉత్తఅబద్ధం.

కవనశర్మ [బెంగుళూరు]

## పత్రిక స్త్రీయా ?...

మీ(మా) తే. 12.8.77 దీ ముఖచిత్రం [జయభారతి] తో జయజయధ్వానాలు చేస్తూ ఠీవిగా వచ్చి నా ముందు నిలిచింది పత్రిక. కుక్కతోక బాగుంది. ప్రతి కథలో కొన్ని తప్పులుంటాయి. అన్నీ ఏర్చి వ్రాయడానికి నాకు తీరిక మీ పత్రికకు స్థలం చాలదని. . , ఆహా అంతే కాదు. నేనూ కథలు వ్రాస్తుంటాను. చదివిన వాళ్లందరూ బాగుందని అంటున్నారు. మీరు మాత్రం త్రిప్పి పంపారు. బహుశా మీ జిహ్వ [టేస్ట్] మా జిహ్వ వేరే కాబోలు. శ్రీనివాస్ ఈ పత్రికలో సినిమా విశేషాలు చాలా బాగా వ్రాశారు. ముఖచిత్రం మగవారి (మన సినీ నాయకులు) ముఖ చిత్రాలలో కూడా యివ్వమని కోరుకునే కోటి ప్రజలలో నేనొకణ్ణి. చూడండి! పత్రికను సహజంగా స్త్రీతో సరిపోలుస్తాము. అలాంటప్పుడు ప్రతీ స్త్రీ భర్తను కోరుకుంటుంది. మరి మీరు మీ పత్రిక ముఖచిత్రం ఎప్పుడూ మగవారి [భర్త] అందాల మోములతో అందించడం లేదే. కె. రామలక్ష్మిగారి జవాబులు, అంతేకాదు. ప్రశ్నలు కూడా బోర్‌గా ఉంటున్నాయి. బహుశా వారం దరికి కూడా ఈ నా లేఖ బోర్‌గా ఉండొచ్చు.

కోట. వెంకటరమణ, (బరంపురం.)

(49 వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం 16–9–'77
పింగళనామ సం॥ భాద్రపద శుద్ధ తదియ
**సంపుటము 70 సంచిక 55**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
పోస్ట్‌లో ఏడాది చందా రు. 41–60
ఆరు మాసాలచందా రు. 20–80
విడిప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ—520 003


## విషయానుక్రమణిక



"దీక్ష"
(ఫొటో : జేప్పీ)

**కథలు : సాంఘిక కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**



లోకం పోకడ— జోమెన్

ఏమిటో! ఇంకా కదలటం లేదా! అయిదు నెలలు అయినా మీరిలానే ఉన్నారు!
సుసంపన్నమైన ప్రదేశానికి మార్గం..
జనతా పాలన

వాయిదా పడిన జీతము బోనస్ అని వాపోతున్నారా! అయితే యిప్పుడు నా బోనస్ ఇవ్వండి!!

బాబూ యిదుగో నీ కొక మంచివార్త! బోనస్ డబ్బంతా చలామణిలోకి వస్తే ధరలు పెరిగి తీరుతాయి

జనతా కార్యాచరణ సంఘం సమావేశం
అయ్యా! మా సమస్యలకి మీ రేమైనా పరిష్కారం కనుక్కున్నారా?
మేము బాబూ పరిష్కార సాధనలో మా అభిప్రాయాలు భిన్నంగా ఉన్నాయి! ఏం చేస్తాం మరి!!

పైవారం : సినిమా శీర్షికలో రాజబాబు, రమాప్రభ, సూర్యకాంతం మొదలైనవారి జోకులు హాస్యసినిమా వ్యాసాలు ప్రత్యేకం ... 'సినిమా' కార్టూన్‌లుకూడా వుంటాయి.



# వేళావిశేషం

వేదుల మీనాక్షీ దేవి

''అమ్మా; అక్కయ్య వచ్చింది''—అంటూ శ్యామల తమ్ముడు పెరట్లో వున్న తల్లి మాణిక్యాంబను ఒక్క కేక పెట్టాడు.

తడిచెయ్యి చెంగున తుడుచుకుంటూ హడావిడిగా వచ్చింది మాణిక్యాంబ.

'రండి అన్నగారూ, శ్యామలా, సుదర్శనం ఏడీ'' అంటూ వియ్యంకుడినీ, కూతుర్ని పలకరించి, మనుమల్నిద్దరినీ దగ్గరకు తీసుకుంది.

''ఆయన క్యాంపు వెళ్లారమ్మా'' అంది శ్యామల.

''ఇలాంటప్పుడు క్యాంపు ఏమిటి ? పెళ్లికి రాడా ?'' ఆందోళనగా అంది తల్లి.

''క్యాంపుకి ఒక సమయమేమిటమ్మా ? అనుకోకుండా అప్పటికప్పుడు వెళ్లవలసి వచ్చింది. పెళ్లి నాటికి పర్మిషన్ అడిగి వస్తానన్నారు'' అంది శ్యామల.

''అమ్మా, అన్ని సామాన్లూ వచ్చాయేమో చూడు ... రిక్షావాళ్లు వెళ్లిపోతున్నారు.'' అన్నాడు శ్యామల మామగారు శోభనాద్రి.

''చూశాను మామయ్యా ... రిక్షాల్లో ఏమీ మరిచిపోలేదు'' అంది శ్యామల.

సామాన్లు గదిలో పెట్టించింది.

మాణిక్యాంబ కాళ్లు కడుక్కుందుకు వియ్యంకుడికి నీళ్లు తెచ్చియిచ్చింది.

''అన్నయ్యగారూ, మీ చిన్నబ్బాయి శేఖరానికీ, అమ్మాయి లీలకూ శుభలేఖలు వేశాం. తప్పకుండా రమ్మని వుత్తరాలు కూడా వ్రాశాం. మా వదినగారు యింకా చిన్నబ్బాయి దగ్గరే వున్నారా ?'' అంది మాణిక్యాంబ.

''అక్కడేవుంది. ఈ పాటికి రావలసిందే మరెందుచేతనో రాలేదు''అన్నాడు శోభనాద్రి

అప్పుడే బజారు నుండి వచ్చిన శ్యామల తండ్రిని చూసి 'తాతయ్యొచ్చాడు' అంటూ ఆయన కాళ్లకు చుట్టుకున్నారు పిల్లలు.

శ్యామల చెల్లెలు పెళ్లి — పదిరోజులు ముందుగానే రమ్మని తండ్రి వెళ్లి, పిలిచి వచ్చాడు. అల్లుడు సుదర్శనం క్యాంపుకి వెళ్లడం సందర్భంలో ముందుగా వెళ్లడం కుదరలేదు.

తెల్లవారితే పెళ్లివారు వస్తారు ఉదయమే స్నాతకం ఆ వెను వెంటనే పెళ్లి మూహూర్తం.

స్నాతకం వేళ అవుతోంది. మీరంతా రండి'' అని మగ పెళ్ళివారు విడిదినుండి వచ్చి పిలిచి వెళ్ళారు.

పెళ్ళిళ్లలో కాఫీ యెంతబాగా తయారు చేయించినా ఇంట్లో నిత్యం తాగే ఫిల్టర్ కాఫీలాగ వుండదు. అందువల్ల ప్రత్యేకంగా ఫిల్టర్ కాఫీ చిక్కగా తయారుచేసి తీసుకు వచ్చింది శ్యామల.

''మామయ్యా. కాఫీ తీసుకోండి. టిఫిన్ తయారవుతోంది. అవగానే తెస్తాను'' అంది.

ఆయన కాఫీగ్లాసు అందుకోబోతుండగా మగపెళ్లివారి తరఫు వ్యక్తి ఒకరు హడావిడిగా వచ్చి 'పెళ్లికొడుక్కి తలనొప్పిగా వుందిట. స్ట్రాంగ్ కాఫీ కావాలిట'' అంటూ శ్యామల చేతిలోని కాఫీగ్లాసు అందుకుని వచ్చినంత వేగంగానూ వెళ్లిపోయాడు!

వెళ్లిపోయారు మామా! కోడలూను!

''ఇప్పుడే తెస్తాను మామయ్యా'' అని ముఖం చిన్నబుచ్చుకుని గబగబా లోపలికి వెళ్ళింది శ్యామల.

''అమ్మాయ్ శ్యామలా... మగపెళ్ళివారి చంటిపిల్లలకు పాలు కావాలిట. మూడు చెంబులు, పెళ్లిపీట, మూడు మామూలు పీటలూ కావాలిట... మన చాకలిచేత అర్జంటుగా పట్టించుకుని వెళ్ళు'' అంది తల్లి.

''అలాగే' అంటూ ఆ ప్రయత్నంలో లీనమైంది శ్యామల.

''వచ్చారా బావగారూ?''

''బాగున్నారా అన్నగారూ?''

''మీమాటే అనుకుంటున్నాను వచ్చారో? లేదో? అని.''

''కూర్చున్నారా?''

''క్షేమమా?''

''కాఫీ పుచ్చుకున్నారా?''

ఈవిధంగా పెళ్లికి వచ్చిన బంధుజనం యావన్మందీ ఒక్కొక్కరే పలకరిస్తున్నారు మర్యాదగా శోభనాద్రిని.

పలకరించిన అందరిలోనూ నవ్వుతూ సమాధానం చెబుతున్నాడాయన.

తొమ్మిది గంటలైంది.

''అక్కా సుదర్శనం బావ వచ్చాడు'' అంటూ విడిదిలోకి వెళ్లిన శ్యామలను పిలుచుకుని వచ్చాడు తమ్ముడు.

# వేళా విశేషం

గబగబా కాఫీ, టిఫిన్ తెచ్చి మామగారి ప్రక్కన కూర్చున్న భర్త సుదర్శనానికి యివ్వబోతుండగా జ్ఞాపకం వచ్చింది మామగారికోసం తెచ్చిన కాఫీ పెళ్లికొడుక్కి పట్టుకుపోయిన విషయం. అప్పటికి టిఫిన్ కూడా తయారు కాలేదన్న సంగతి కూడా గుర్తు కావచ్చింది.

గతుక్కుమంది శ్యామల.

''మీకు తెస్తాను మామయ్యా ఇప్పుడే'' అంటున్న శ్యామలను ప్రశ్నార్థకంగా చూశాడు సుదర్శనం.

''నువ్వు కాఫీ త్రాగలేదా నాన్నా యింత వరకు?'' అడిగాడు తండ్రిని.

''లేదు. అమ్మాయి తెచ్చింది. ఇంతలో అర్జంటుగా పెళ్లికొడుక్కి కావాలని ఎవరో వచ్చి పట్టుకువెళ్లి పోయారు ఆ కాఫీ.'' అన్నాడు శోభనాద్రి.

శ్యామల తనకిచ్చిన కాఫీ, టిఫిన్ తండ్రికిచ్చాడు సుదర్శనం.

''నాకు పట్టుకురా'' అన్నాడు భార్యను.

శ్యామల సిగ్గుతో కుంచించుకుపోయింది. వెళ్లి భర్తకి కాఫీ, ఫలహారం తెచ్చిఇచ్చింది.

పెద్దాయన తెల్లవారేసరికి కాఫీ త్రాగితే గాని వుండలేరు. పాలు రావడం ఆలస్యమై అసలే కాఫీ కలిపేసరికి ప్రొద్దు యెక్కింది అనుకుంది తను... ఆవేళకి కూడా ఆయనకు కాఫీ లేకుండా అయింది... ఎంత పొరపాటు జరిగింది తనవల్ల... ఎక్కడకు వెడితే అక్కడే పని కనబడుతోంది... అందరూ తలొకవైపునా పనులు పురమాయిస్తుంటే తను ఆయన కాఫీ మాటే మరిచిపోయింది. అని ఎంతో బాధపడింది శ్యామల... ఆ సంగతే భర్తతో అంది.

## 3

స్నాతకం అయింది. పెళ్లివారు తరలి వచ్చారు. ఎదురు సన్నాహం తంతు జరుగుతోంది.



''వేడినీళ్లు తోడి, స్నానాలగదిలో పెట్టానండి సబ్బు, తువ్వాలు అక్కడే వుంచాను. వెళ్ళి స్నానం చెయ్యండి'' అంది శ్యామల.

''ఇప్పుడే వెడుతున్నాను. నువ్వు అవతల పనులు చూసుకో'' అంటూ లేచాడు శోభనాద్రి.

భుజంమీద తువ్వాలు స్నానాల గదిలోని తీగపైన వేసి స్నానాని కుపక్రమిస్తుండగా తలుపు దబదబ బాదిన చప్పుడై గడియ తీశాడాయన.

''మీరా! స్నానం యింకా ప్రారంభించలేదు కదూ ఒక్కక్షణం ఆగండి. పెళ్లికుమారుడు మంగళస్నానానికి వచ్చాడు అవతల ముహూర్తానికి ఆట్టే వ్యవధిలేదు ఈలోగా తంతంతా పూర్తికావాలి'' అన్నాడు పురోహితుడు.

ఆయన వెనుకే నుదుట నిలువుకుంకం బొట్టుతో, తలమీద నూనెను అంటుకుపోయిన అక్షతలతో పెళ్లికుమారుడు, అతని బావలేకాబోలుఒక పెద్దముత్తయిదువపసుపు పళ్ళెంతో, కుంకుడుకాయలు నానవేసిన గిన్నెతో నిలబడివున్నారు.

''ఎంతమాట! తప్పకుండాను.'' అంటూ తీగమీద వేసిన తువ్వాలు భుజాన వేసుకుని బైటకు వచ్చాడు శోభనాద్రి.

పందిట్లో వివాహ ప్రయత్నాలు జరుగుతున్నాయి. పెళ్లికి వచ్చిన ఆడ మగ తెగ హడావిడిగా తిరుగుతున్నారు ఎవరేపనిచెప్పినా ఆపని మరొకరికి, ఆమరొకరు యింకొకరికి ఈ విధంగా గొలుసుకట్టులాగ, అంచెలంచెలుగా కబురు వెళ్లడమేగాని ఆపని జరిగిందో లేదో అన్న ధ్యాసే ఎవరికీలేదు.

శ్యామల వూపిరి సలపకుండా అటూ, ఇటూ అందింపులతో, పనులతో సతమతమౌతోంది.

తల్లీ, తండ్రీ పీటలమీద కూర్చున్నారు.

గౌరీపూజ, ప్రవరలు చదవడం తంతు పూర్తయింది. బుట్టలో కూర్చున పెళ్లికుమార్తె పద్మను ఆపాటునే తీసుకువచ్చి, తల్లి దండ్రులప్రక్కన కల్యాణమండపంలో దింపాడు మేనమామ.

అప్పటికి అయిదారు మార్లు స్నానం చేసే ప్రయత్నంలో వెళ్ళిన శోభనాద్రి ఎవరో ఒకరు స్నానం చేస్తుండడం వల్ల కుదరలేదు నూతి దగ్గర ఖాళీగావుంది కాస్త నాలుగు చాదలు పోసుకుంటే పనయిపోతుంది




నోతిలో చాదవెయ్యబోతున్న ఆయన చెయ్యి వెనకనుండి ఎవరో గట్టిగా పట్టుకున్నారు.

శోభనాద్రి వెనక్కి చూశాడు.

ఆవ్యక్తి శ్యామల మేనమామ.

"అయ్యో, మీరు. ఈ యింటి వారి వియ్యంకుడు. మీరుతోడుకోవడమా? పైగా చన్నీళ్లా?.. ఒరే. చాకలీ. అయ్యగారికి చప్పున వేణీళ్లు తోడి తీసుకురా" అని పురమాయించి, ఎవరో పిలుస్తుంటే గబగబా పందిట్లోకి వెళ్లి పోయాడు ఆయన

"ఆయమ్మ గారెవరో హైదరాబాదు నించి వచ్చారట. వానలో తడిసిపోయాదట. వారికిప్పుడే నీళ్లుతోడిపెట్టి, బాయిలర్‌లో చన్నీళ్లు పోశాను. ఒక్కక్షణంలో కాగిపోతాయి తోడి యిచ్చేస్తాను" అన్నాడు చాకలి.

"ఫరవాలేదు. నాకు ప్రొద్దుటే స్నానం చెయ్యడం అలవాటు. నన్ను స్నానం చెయ్యనియ్యి. నీ పుణ్యం వుంటుంది" అని స్నానానికి ఉపక్రమించాడు శోభనాద్రి.

"ఇంతవరకు స్నానం చెయ్యలేదా నాన్నా?" పనిమీద అటుగా వచ్చిన సుదర్శనం అన్నాడు.

"ఏదీ ... ఇంతవరకు పోసుకుందుకు సావకాశం లేకపోయింది" అన్నాడు తండ్రి.

"ఇందాకా మీకు నీళ్లు తోడి పెట్టి, మిమ్మల్ని స్నానం చెయ్యమన్నాను కదా మామయ్యా!" అంది శ్యామల ఆశ్చర్యపోతూ.

"అప్పుడే వెళ్లానమ్మా. పెళ్లికొడుకుని మంగళస్నానం చేయించడానికి తీసుకు వచ్చారు... అది ముఖ్యమా? నా స్నానం ముఖ్యమా? మనం అంతావచ్చిందే పెళ్లికి కదా. దానిగురించిన పనేకదా మంగళ స్నానం?" అన్నాడు శోభనాద్రి.

"అయ్యో అదంతా నాకు తెలియదు. మీ స్నానం అయిందనే అనుకుంటున్నాను" అని నొచ్చుకుంది కోడలు.

"సందడి సమయంలో సదుపాయాలు కావాలంటే ఎలాగ? నువ్వేమీ బాధపడకమ్మాయ్" అన్నాడాయన.

పెళ్లితంతు పూర్తయింది.

వధూవరులకు చదివింపులు ప్రారంభమైనాయి.

"జనమంచి శోభనాద్రిగారు వధువుకు



## 16-9-1977 శుక్రవారం మొదలు
## 22-9-1977 గురువారం వరకు

**మేషం:—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో శ్రమకలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**వృషభం:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిధునం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో పోటీవారిపోటీ పెరుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబవ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:—** స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. విద్యావైజ్ఞానిక రంగాలో ఖ్యాతి లభిస్తుంది. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది ప్రయాణాలు వాయిదా పడతాయి.

**సింహం:—** అనుకూలమైన వార్తలను వింటారు వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహిత్య కళా రంగాలో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కన్య:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులు సహాయం చేస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు —

---

ఆశీర్వచన పూర్వకంగా పట్టుచీర ' అన్నాడు పురోహితుడు.

'అదేమిటి అబ్బాయ్ నా పేరు ఏమిటి. నీ పేరో శ్యామలపేరో చదివించలేక పోయావా ?' అన్నాడు శోభనాద్రి తన కొడుకు పాకెట్టు వధువుకిమ్మని చేతికిస్తుంటే...

''నేనివ్వడం యేమిటి మగవాడిని. అమ్మాయిచేత యిప్పించు. ఆడవాళ్లే యివ్వాలి'' అన్నాడాయన.

''పెద్దవారు మీరు. ఎవరిస్తే యేమిటి ? అంది కోడలు.

''అదికాదమ్మా, ఆడవాళ్లకి బొట్టు పెట్టి ఆడవాళ్లే యివ్వాలి. ఇదిగో యీ పాకట్టు విప్పి చీరకి పసుపుబొట్టు పెట్టి యియ్యి'' అన్నాడు శోభనాద్రి.

ఆయన చెప్పినట్లే చేసింది శ్యామల.

అంతవరకు కూర్చుని నడుంలాగి అలాగ బైటకు వెళ్లాడు శోభనాద్రి.

ఆశీర్వచన మంత్రాలు పూర్తయాయి.

అంతా అక్షతలు వధూవరులపైనా, కన్యాదాతలపైనా జల్లారు ... వేదిక దాకా వెళ్లడానికి జనం క్రిక్కిరిసి వుండడం వల్ల శోభనాద్రి వేసిన అక్షతలు మధ్య వాళ్లమీదే పడ్డాయి.

### 4

''పెళ్లివారు భోజనానికి వస్తున్నారు. మనవాళ్లకి గదిలో వడ్డిస్తున్నారు. అక్కడ మొదట పీట వేశాను. అక్కడ మీరు కూర్చోండి. ఉదయం ముహూర్తం వల్ల బాగా ఆలస్యమైంది భోజనానికి ఇప్పటికే'' అంది శ్యామల మామగారిని.

''అలాగేనమ్మా. నా గురించి ఆలోచించకు. అవతల పెళ్లివారికి ఏం కావాలో అంతా వచ్చారో లేదో... విడిదిలో ఎవరైనా రాకుండా వుండిపోయారేమో... ఒక్కమారు నువ్వైనాసరే, మా అబ్బాయైనాసరే వెళ్లి చూడండి. తేడావస్తే గొడవలొస్తాయి'' అంటూ కోడలిని హెచ్చరించాడాయన.

'అలాగే' అంటూ శ్యామల వెళ్లిపోయింది.

మగపెళ్లివారితో పెళ్లి పందిరి, సావడి, ఉత్తరదిక్కు వసారా నిండిపోయాయి. శోభనాద్రికోసం ఏర్పాటు చేసినచోట ఎవరో కూర్చున్నారు. కూర్చున్న వాళ్లను లెమ్మనడం ఏం మర్యాద?

పోనీ... ఎలాగా యివతల వున్నారుగదా వడ్డనలో సహాయం చేద్దామని నేతి జారీ పుచ్చుకునే ప్రయత్నంలో వుండగా ఎవరో వచ్చి ఆయన్ను ఆ ప్రయత్నం నుండి విరమింప చేశారు! ''మీరు వడ్డించడం ఏమిటి?'' అంటూ.

భోజనాలయాయి.

పెళ్లివారికి తాంబూలపు సామాన్లు విడిదికి పంపి, లోపలికి వచ్చిన శ్యామల దక్షిణపు వసారాలో చాపమీద తలక్రింద చెయ్యి పెట్టుకుని పక్కకు తిరిగి పడుకున్న మామగారిని చూసింది.

''మీరు భోజనం చెయ్యలేదామామయ్యా? నేను మగపెళ్లివారి భోజనాలచోట ఆడవాళ్ల విషయం చూస్తున్నా నింతవరకు'' అంది శ్యామల ఆత్రతగా.

''ఎక్కడ ఖాళీలేకపోయిందమ్మా. నువ్వు

## వేళా విశేషం

చెప్పినచోట యెవరో కూర్చున్నారు. లెమ్మంటే మర్యాదేనా చెప్పు? అబ్బాయి ఏడీ?''

''పెళ్లివారిని సాగనంపడానికి సందు చివరదాకా వెళ్లారు. లేవండి. మళ్లీ పంక్తి వేస్తున్నారు. అందరం తిందాం రండి.''

''పిల్లలు తిన్నారా? ఇలాంటి సందడి సమయంలో పిల్లల విషయం పట్టించుకోక పోవడంవల్ల వేళకు వాళ్లకు సదుపాయాలు జరగవు. ఏరీ వాళ్లు?''

''సుష్టుగా భోజనం చేసి, కిళ్లీలు నములుతూ వీధి పందిట్లో కబుర్లు చెప్పకుంటున్నారు పిల్లలతో'' అంది శ్యామల.

కుమారుని సరసను కూర్చుని భోజనం చేశాడు శోభనాద్రి.

అప్పటికి మధ్యాహ్నం మూడు గంటలైంది.

''ఇక్కడ మంచం వేశాను. కాస్త నడుం వాల్చండి'' అంది శ్యామల ... దక్షిణంవైపేమో...గాలి రివ్వున వస్తోంది. ప్రొద్దుపోయి భోజనం... పడుకునీ పడుకోడంతో గాఢంగా నిద్రపట్టేసింది శోభనాద్రికి.

నాలుగు గంటలైనట్లు గోడ గడియారం నాలుగుమార్లు కొట్టింది.

''బాబుగారూ... బాబుగారూ' అన్న పిలుపుతో వులిక్కిపడి కళ్లు తెరిచాడు శోభనాద్రి.

ఎదురుగా పనివాడు మసక మసకగా

ఫలం ★

...యం బాగుంటుంది శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు
...లు — వృత్తి వ్యాపారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందగలదు మీ శ్రమకు తగిన ఫలితం లభించదు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు — కుటుంబవ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు
...శ్చికం — ఫలితం లేని శ్రమ కలుగుతుంది ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం మధ్యలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి వృత్తిలో ఆదాయం బాగుంటుంది ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

ధనుస్సు:— రావలసిన డబ్బు అందగలదు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలువస్తాయి ప్రయాస కలుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మకరం:— అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

కుంభం:— వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు సాహసిక వ్యవహారాలు లాభించగలవు స్త్రీలకు— విలాస వస్తువులు కొంటారు సాటివారిలో గౌరవం లభిస్తుంది

మీనం.— వ్యతిరేకమైన వార్తలను వింటారు ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు అధికారు వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. పుణ్యకార్యాలు చేస్తారు.

—మహేష్

...పడుతున్నాడు.

"అలకపానుపటండి... మంచం తెమ్మన్నరు" అన్నాడు పనివాడు.

గాఢనిద్రలో వుండగా మెళుకువరావడం ...ల్ల ఒక్కక్షణం ఆయన యెక్కడ వున్నదీ ...ర్తు రాలేదు... ఆ తరువాత నెమ్మదిగా ..., పైనవున్న కండువా నేలపై పరచు... పడుకున్నాడాయన... కళ్లు మూతలు ...పోయాయి మళ్లీ.

రెండు రోజులు పర్మిషన్‌మీద వచ్చిన ...ర్శనం మర్నాడు క్యాంపు వూరు వెళ్లి...నూడు.

## 5

మగపెళ్లివారు గృహప్రవేశానికి పెళ్లి కుమార్తెను తీసుకు వెడుతున్నారు... అందరినీ రమ్మని ఆహ్వానించారు.

"అన్నయ్యగారూ ... ఇల్లు ఎలాగ వుండాలో అలాగేవుంది. అన్నీ సర్దుకోవాలి.. స్వతం సామాన్లు తెచ్చాం. ఇంకా కొన్ని తెలిసినవాళ్లదగ్గర తెచ్చాం... బంధువులు వెళ్లేవాళ్లు వెడుతున్నారు. ఎవరెవరికేం యివ్వాలో చూసుకోవాలి. అందరినీ పంపాలి మర్యాదగా... గృహప్రవేశానికి పెళ్లికూతురితో వెళ్లడానికి యెలాగ కుదురుతుంది చెప్పండి... అందుకోసం మీ కోడల్ని వెళ్లమందామనుకుంటున్నాను పిల్లతో. ఏమంటారు మీరు ?" అంది వియ్యపురాలు శోభనాద్రితో.

"ఏమనడం ఏమిటమ్మా నేను? నిక్షేపంలాగ వెళ్లవచ్చు శ్యామల" అన్నాడాయన.

తను వచ్చేదాకా మామగారికి కావలసిన సదుపాయాలు చూడమని పరి పరివిధాల చెప్పి మరీ వెళ్లింది శ్యామల చెల్లెలి గృహప్రవేశానికి.

బంధువులంతా ఆ సాయంత్రానికి వెళ్లిపోయారు.

ఇల్లంతా నాగవల్లి తీర్చినట్లు బావురుమంటోంది.

మాణిక్యాంబ, భర్త తెచ్చిన సామాన్లు అప్పగించడంలో సతమతమవౌతున్నారు.

పెళ్లిపనులు ప్రారంభించింది మొదలు అంతవరకు సతమతమయారేమో. ఆబడలికలతో కొట్టినట్లు పడివున్నారు నిద్రతో.

శోభనాద్రికితెల్లవారు ఝామున లేవటం అలవాటు. యథాప్రకారం మెళుకువ వచ్చేసింది. ఏం చెయ్యడానికీ తోచలేదు. ఆరు గంటల వరకు ఎలాగో కాలక్షేపం చేసి ఆ దగ్గర్లోనే వున్న హోటల్‌కివెళ్లి కాఫీ, టిఫిన్ తీసుకుని, వూళ్లోకాస్తసేపు తిరిగి వచ్చాడు.

ఏడుగంటలవుతుండగా ఒక్కొక్కరే లేచారు. యెనిమిది గంటలకు వచ్చిన శోభనాద్రిని చూసిన వియ్యపురాలు "ఎంత పనైంది అన్నయ్యగారూ. మెళుకువరాలేదు. మీరెక్కడికి వెళ్లారా? అనుకుంటున్నాం" అంది నొచ్చుకుంటూ.

"ఫరవాలేదమ్మా. పెళ్లంటే మాటలా? ఏదో సవ్యంగా అనుకున్నది అనుకున్నట్లు జరిగిపోయింది. అదీకావలసింది. మిగిలినవన్నీ లెక్కలోనికావు. ఏదోతోచక అలాగ షికారుగా తిరిగివచ్చాను" అన్నాడు శోభనాద్రి.

ఇప్పుడు పెళ్లి బడలికఅనేకాదు. తమ యింట్లో లాగ వీరింట్లో త్వరగా పనులు కావాలని అడావిడిలేదు. లోకంలో అందరి భోజనాల వేళవీరికి కాఫీలవేళ. అందరి కాఫీల వేళ భోజనాల వేళ అన్నా అతిశయోక్తికాదు ఫలనా వేళకి ఫలనా పని అవాలనే అగత్యంలేదు. వాళ్లెంత మర్యాద చేస్తున్నా తను నిలవలేక పోతున్నాడు శోభనాద్రి.

మను గుడుపులకు పెళ్లివారిని తీసుకు వచ్చింది శ్యామల. పెళ్లికుమారుడు, తల్లీ, తండ్రీ, ఇద్దరు అక్కలు వచ్చారు.

"అమ్మాయీ, నేను వెడతాను. దొంగల భయాలు ఎక్కువగావున్నాయి.ఇన్నాళ్లంటూ ననుకోలేదుకదా నేను. పెళ్లివారు వెళ్లేదాకా మీ అమ్మకి నువ్వు సహాయంగా వుండాలి. ఆతరువాత వద్దువుగాని మీతమ్ముణ్ణి తీసుకుని" అన్నాడు శ్యామలతో మామగారు.

ఆయన చెప్పినదీ నిజమే. తాళం వేసి వుంటే పట్టపగలే యిళ్లు దోచుకుపోయే రోజులు వచ్చాయి. అందువల్ల ఆయన ప్రయాణానికి అంతాఅంగీకరించకతప్పలేదు.

"అమ్మాయిని పిల్లల్నీ నేనుదిగబెడతాను లెండి' అన్నాడు వియ్యంకుడు.

బస్సుకి రిజర్వేషన్ చేయించింది ముందు రోజునే శ్యామల తన తమ్ముణ్ణి బస్ స్టాండ్‌కి పంపి.

వియ్యంకుడు బస్సుదాకా వచ్చి సాగనంపుతానంటే వద్దుగాక వద్దని తను బయల్దేరి వెళ్లాడు శోభనాద్రి.

త్రోవలో రిక్షా టైర్ పంచరయింది. మరొక రిక్షాను కట్టించుకుని వెళ్లేసరికి

## వేళా విశేషం

ఆయన వెళ్లవలసిన బస్సు అప్పుడే వెళ్లిపోయింది. ఆ బస్సు అక్కడినుండే బైల్దేరుతుంది. నేరుగా రాజమండ్రి వెడుతుంది... ఏం చెయ్యాలా అని అనుకుంటుండగా శ్రీకాకుళం నుండి రాజమండ్రి వెళ్లే బస్సు గంటలో వస్తుందన్నారు అక్కడ వున్న వాళ్లు... ఎలాగో ఆ స్టాండ్‌లోనే కాలక్షేపం చెయ్యగా చెయ్యగా అరగంట లేటుతో, నిండు చూలాలు లాగ వచ్చింది జనంతో బస్సు.

దిగేవాళ్లు తక్కువ... ఎక్కేవాళ్లు ఎక్కువ... జనాన్ని తోసుకుంటూ బస్సులో అడుగు పెట్టడానికి యుద్ధరంగంలో వీరుడు చూపవలసినంత పరాక్రమం చూపవలసి వచ్చింది శోభనాద్రి. ఇటువంటి ఘట్టాలు బస్సులోనే కాదు... రైళ్లల్లోనే కాదు... ప్రయాణపు వాహనాలన్నవి ఎన్నుంటే అన్నిటిదగ్గరా యెదుర్కోవలసి వస్తోంది ప్రయాణీకులు ఈ రోజుల్లో.

బస్సు కదిలింది.

### 6

"టికెట్ సార్"

జేబులో చెయ్యి పెట్టిన శోభనాద్రి ముఖం వివర్ణమైంది!...

గుండె ఆగినంత పనైంది!

పర్సులేదు!

ఈ త్రొక్కిసలాటలో ఎవరో లాగేసి వుండాలి...టిక్కట్టు కొనడానికి డబ్బెలాగ?

"బాబూ, నా పర్సు బస్సు ఎక్కేదాకా జేబులోనే వుంది. ఇప్పుడు కనబడ్డంలేదు. టిక్కట్టుని, ముందుగా రిజర్వేషన్ చేయించుకుంటే ఆ బస్సు దాటిపోయింది" అన్నాడు శోభనాద్రి.

"వచ్చే స్టాప్‌లో దిగిపొండి" అన్నాడు కండక్టరు.

"అర్ధాంతరంగా దిగి ఎక్కడికి వెళ్లను చెప్పు? నేను పరువుగా బ్రతుకుతున్నవాడిని. మళ్లీ ఈ బస్సు అక్కడనుండి యెప్పుడు బయలుదేరుతుందో చెప్పు... నేను యింటికి వెళ్లి సొమ్ము తెచ్చి యిస్తాను నీకు" అన్నాడు బ్రతిమాలుతున్నట్లుగా ఆయన.

"మళ్లీ అటునుండి బైలుదేరే బస్సులో నాకు డ్యూటీ లేదండి" అన్నాడు కండక్టరు.

ఎన్నడూ జన్మలో ఎదురుచూడని,

# హైదరాబాద్ నోట్ బుక్

## డాక్టర్ దాశరథికి ఆస్థానకవి పదవి

సుప్రసిద్ధ కవి, చలనచిత్ర గేయకారుడు, డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులను ఆస్థాన కవిగా నియమించినట్టు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళ రావు ఆగస్టు 16 వ తేదీన ప్రకటించారు. డాక్టర్ దాశరథి వయస్సు 50 సంవత్సరాలు. ఈయన 5 వ ఆస్థాన కవి. మొదటివారు తిరుపతి-వేంకటకవులలోని చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రి. తర్వాత వరుసగా మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, అవధాన శిరోమణి కాశీకృష్ణాచార్యులు, డాక్టర్ విశ్వనాథసత్యనారాయణ ఆస్థాన కవులుగా ఉన్నారు. దాశరథి బహుభాషావేత్త. 12 కావ్యాలు, 2,000 కు పైగా గేయాలు రచించారు. నిజాం వ్యతిరేకోద్యమంలో కారాగార క్లేశం అనుభవించారు. కారాగారంలోనే అగ్నిధార అనే కవితా సంపుటి వ్రాశారు. మునిసి నక్కకు రాచరికంబు దక్కునే? అని, వద్దంటే గద్దె ఎక్కి పెద్దరికం చేసేవా? దిగి పోవోయ్ తెగి పోవోయ్, ఇదేమాట ఇదేమాట పదే అనేస్తాను. అని నిజాం వ్యతిరేకంగా గొంతు విప్పినవారు. ఈయన తిమిరంలో సమరం కవితా సంపుటికి 1974 లో కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది. నిరుడు రాష్ట్ర ప్రభుత్వం అధికార భాషాసభ్యులు అయ్యారు. ఆంధ్ర, ఆగ్రా విశ్వవిద్యాలయాలు ఆయనను గౌరవ డాక్టరేటు బిరుదాలతో గౌరవించాయి. నిరుడు ఆయన నా ఆలోచనా లోచనాలు అనే కవితా సంపుటిని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళ రావుకు అంకితమిచ్చారు. ఆస్థాన కవిగా దాశరథి ఏడాదికి ఆరు వేల రూపాయలు పురస్కారం పొందుతారు. దాశరథి ఖమ్మం జిల్లా చిన్న గూడూరులో సంస్కృత విద్వాంసుల వంశంలో జన్మించారు. ఇటీవలె మలయా, సింగపూరు మున్నగు దేశాలలో పర్యటించి వచ్చారు.

## నగరంలో దోపిడీలు

ఇటీవల నగరంలో దోపిడీలు దొంగతనాలు ఎక్కువయ్యాయి. చదువు, సంస్కారం, రక్షణ వున్న నగరంలో దోపిడీలంటే ఎవరికయినా ఆశ్చర్యం కలుగుతుంది. ఆగస్టు 16 వ సంతోష్ నగర్‌లో కొందరు వ్యక్తులు మారణాయుధాలతో ఇళ్లపై బడి దోచుకున్నారు. హైదరాబాద్ స్టేట్ బ్యాంకి అధికారి ... ఇంట్లో ఆగస్టు 21 న దొంగతనమయింది. జూన్ నెలలో సుబ్రహ్మణ్య కాలనీలో ఇలాటిదోపిడీ జరిగింది. ఆగస్టు 18 న రామంత పూర్‌లో మరొక దోపిడీ జరిగింది. దోపిడీల నివారణకు తగిన చర్య తీసుకుంటామని ముఖ్యమంత్రి హామీ యిచ్చారు.

## జనతా అన్నం పొట్లాలు

విధాన పరిషత్తు సభ్యులు, ప్రముఖ ప్రతిపక్ష నాయకులు శ్రీ వి. పి. రాఘవాచారి అధ్యక్షతన ఏర్పడిన జనతా సేవాసంఘం నగరంలో ఆగస్టు 16 వ తేదీ నుంచి జనతా ఆహారం పొట్లాలు అమ్మడం ప్రారంభించింది. ఈ పొట్లంలో ఒకదాని బరువు 225 గ్రాములు. ధర 50 పైసలు. సాధారణంగా ఒక వ్యక్తి మధ్యాహ్న భోజనానికి 400 గ్రాముల ఆహారం తీసుకుంటాడని రూపాయి పెట్టి రెండు జనతా అన్నం పొట్లాలు కొనుక్కుంటే కడుపు నిండిపోతుందని శ్రీ రాఘవాచారి వివరించారు.

---

వూహించని పరిస్థితిలో పడ్డాడు శోభనాద్రి. ఆయన మనస్సు వికలమైంది.

పెళ్లికని బైల్దేరింది మొదలు అనుక్షణం అసౌకర్యమే యెదుర్కోవలసివచ్చింది. తను వియ్యాల వారింట్లో అడుగు పెట్టింది మొదలు బంధువులంతా ఎవరో ఒకరు అనుక్షణం పలకరిస్తూనే వున్నారు.. కోడలు శ్యామల శతవిధాల తన విషయం శ్రద్ధగా వో కంట కనిపెడుతూనే వుంది అయినా తను అడుగడుగునా యిబ్బంది పడుతూనే వున్నాడు! ఎవరినననడానికీ ఎవ్వరి తప్పులేదు... పాపం. తన తిరుగు ప్రయాణానికికూడా తనకు శ్రమ లేకుండా టిక్కట్టు తెప్పించి యిచ్చారు. డబ్బు యిస్తే పుచ్చుకోలేదు! ఆ బస్సు తప్పటమా! పోని అంటే మొదటికేమోసం అన్నట్టు ప్రయాణం- ముందుకు సాగనీయకుండా శనిలాగ ఈ పర్సు పోవడమూ! ఇదంతా నీ జాతక ప్రభావం అంతే. అనుకోవలసి వుంది.

ఈ విధంగా పరి పరివిధాల మనసులో వేదన పడుతూ ''ఉస్సు''రని నుదుట బట్టిన చెమటను కండువాతో తుడుచుకుంటున్న శోభనాద్రి.

''బాబుగారూ ... మీది రాజమండ్రీ కదూ'' అన్న మాటలు వినబడి తలెత్తి చూశాడా వ్యక్తిని ఆయన.

ఒక మధ్యవయస్కుడు.

''ఔనండి.''

''మీ వెనక వీధిలో వున్నాం మేము కందాళంవారు మా యింటిపేరు .. నేను శ్రీకాకుళంనుండి వస్తున్నాను. మీరు టిక్కట్టు తీసుకోండి. ఇంటికి వెళ్లాక నాకు డబ్బు యిద్దురుగాని'' అన్నాడు

ఆ మధ్య వయస్కుని దగ్గర్నుండి డబ్బు తీసుకుని శోభనాద్రికి టిక్కట్టు యిచ్చాడు కండక్టరు

భగవంతుడంటూ నాలుగు చేతులతోను, కిరీటంతో, కుండలాలతో ప్రత్యక్షంకాడు సాటి వ్యక్తుల రూపంలోనే వుంటాడను కుంటూ ఎంతో ఆనందించాడు శోభనాద్రి

ఆ మధ్య వయస్కుని సహకారానికి అభినందించాడు. అంతవరకు ప్రేక్షకులుగా వున్న ప్రయాణీకులు ఆ సంఘటనచూసి శోభనాద్రినీ, ఆ మధ్యవయస్కుని మార్చి మార్చి చూస్తూండి పోయారు

బస్సు రాజమండ్రీ స్టాండుకి చేరింది.

పెళ్లికి బైలుదేరిన వేళా విశేషం! అడుగడుగునా తనుపడిన యిబ్బందుల్ని తలుచుకుంటూ, సూట్ కేస్ చేత్తో పట్టుకుని బస్సు దిగి రోడ్డుమీదకి వెడుతున్నాడు శోభనాద్రి.

''ఏమండీ.. ఇదిగో. మిమ్మల్నే.''

పరిచయమైన కంఠం విని వెనక్కి చూశాడు. తనభార్య రుక్మిణమ్మ!!

''నువ్వా! హైదరాబాదునుండి యెప్పుడు వచ్చావు? ఇక్కడెందుకు కున్నావు?'' ఆశ్చర్యంతో ప్రశ్నలపరంపర కురిపించాడు.

''ఇవ్వాళవుదయం గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వచ్చాను నేను వస్తున్నట్టు చిన్నబ్బాయి మీకు వుత్తరం వ్రాశాడు. అదిమీకుమొన్ననే అందుతుందన్నాడు. పెళ్లికి పెద్దబ్బాయి, కోడలు, పిల్లలు వెడతారని తెలుసు. ఒకవేళ మరీ మిమ్మల్నిబలవంతంచేస్తే ముహూర్తం వేళకి వెళ్లి, మర్నాడు వచ్చేస్తారుకదా అనుకున్నాం. తీరావచ్చేసరికి స్టేషన్‌కి మీరు రాలేదు. ఇంటికివస్తే తాళం వేసివుంది. పెళ్లికి వెళ్లారనీ, యింకారాలేదనీ, పక్కింటి కామాక్షి చెప్పింది. ఇక వెంటనే బయలుదేరి అక్కడికి రాలేక పోయాను ఉదయం. భోజనంచేసి మరీవెళ్లమంది కామాక్షి ఇప్పుడు విశాఖపట్నం వెళ్లే బస్సువుంది అనివచ్చాను అక్కడికివద్దామని'' అంది రుక్మిణమ్మ.

''నయం. అదృష్టం బాగుంది. ఇద్దరం చెరొక దారీ అయి అవస్థ పడక్కర్లేకుండా సరిపోయింది. ఇంటికి పోదాంపద'' అంటూ రిక్షాపిలిచాడు శోభనాద్రి.

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**పి. హెచ్ వి – నెల్లూరు**

సమాన హక్కులుకావాలని కోరుతూనే తమ పేర్ల వెనుక భర్తల పేర్లు తండ్రుల పేర్లు తగిలించు కుంటారెందుకు ?

సమాన హక్కులు కోరడానికి. . ఫలానావారి కూతురని, ఫలానావారి భార్య అనో అనిపించు కుందుకూ —సంబంధం ఏమిటో నాకర్థంకాదు సంఘంలో మగవానితో సాటిమనిషిగా గుర్తించ బడాలనే గాని భార్యలు కాకుండానూ కూతుళ్లు కాకుండానూ ఉండాలని ఆడవాళ్లు కోరడంలేదు. అలా ఏ ఆడపిల్లయినా నాకు పెళ్లివద్దు అన్నంత మాత్రాన అదొక దేశద్రోహంగా చూడక్కరలేదే! ఆర్థికంగా స్వంత కాళ్ల మీద నిలబడ గలిగినపుడు కన్యలుగా ఉండదలుచు కుంటే — వారినిచిన్న చూపు చూడ్డం— తప్పు (అక్కడికి ఆడదానికి పెళ్లికి మినహా దారిలేనట్టు!)

**కె కె. ఆర్ – ఒంగోలు**

ఎన్ని తీర్థాలు సేవించినా, ఎన్ని క్షేత్రాలు దర్శించినా ఎన్ని దేవుళ్లకి మొక్కినా వచ్చే ఫలితం కన్నా భర్తకు తగిన సేవలు చేస్తే వచ్చే ఫలితం గొప్పదని మన భారతీయ ఇతిహాసాలు వర్ణిస్తున్నాయి. మన కన్న అతీతం అన్న భావన కల్గినప్పుడే కదా భయం భక్తి శ్రద్ధ ఏర్పడతాయి.... అందుకే స్త్రీకన్నా పురుషుడు అతీతంగా ఉండాలి—

ఇతిహాసాలన్నీ పురుష పక్షపాతంతో రాసినవే. కాలం మారినా అన్ని రంగాలలో విలువల కొలమానాలు మారినా స్త్రీ విలువ కొలిచే సాధనం— ఈ పాత చింతకాయ పచ్చడి— లాంటి ఇతిహాసాలూ మను ధర్మ శాస్త్రాలూనేనా? వాటిని కాల్చి తగలెయ్యండి. మగవాడికి మారిన కాలం ఆడదానికెందుకు మార లేదు— కాస్త ఆలోచించండి. పుణ్యతీర్థాలూ చప్పిడి కూడూ కబుర్లకి స్వస్తి చెప్పి— స్త్రీ సాటి మనిషి అని ఆలోచిస్తే—మీ ప్రశ్నకి— అర్థం లేదు .. భార్యతో పంచుకోలేని పుణ్యం భర్తకెక్కడిది ?! లేదు.

**వి వి. ఎన్ ఆర్. – విజయవాడ**

మీరు గీపెట్టి చచ్చినా ఆడది మగవాడితో సమానంకాదు

గట్టిగా అరుస్తే తప్పించి రైటు అనుకోరనా మీ ఉద్దేశ్యం! .. అరవడంలోనే ఉంటుంది ఆర్గ్యుమెంటులోని బలహీనత. అందుకే నేను మామూలుగానే— మగాడికంటే ఆడది ఎక్కువని— నమ్మి ఆలోచిస్తాను !

**ఆర్. వి మద్దిపాడు**

పురుషులకు పాతికేళ్ల దాకా పెళ్లి కాకపోయినా ఏమీ అనుకోరు మరి పదిహేను దాటితే స్త్రీలకి వెతకడం మొదలుపెడతారు ఎందుకు?

పదిహేను దాటిన కన్నె వధువు కాగలదే గాని అదే వయస్సు అబ్బాయి — చిన్న కుర్రాడికిందే లెక్క! స్త్రీపురుషుల మానసిక ప్రమాణంలో వయస్సును బట్టిన మానసిక ఎదుగుదల చాలా తేడాగా ఉంటుంది అందుకే పదిహేను పద్దెనిమిదేళ్ల కుర్రకారు ప్రేమించాను ఏంచెయ్యను ? అంటుంటారు. ఈ ప్రశ్న ఏ పిల్లా అడగదు !

**ఎస్ కె హెచ్ – తురిమెర్ల**

తెరమీది నటీనటులకి, రంగస్థల నటీనటులకి తేడా ఏమిటి?

తెరమీది నటీనటులకు చేసిన తప్పులు దిద్దుకుంటూ నటించే అవకాశం ఉంటుంది రంగస్థల నటులకి ఆ అవకాశం దొరకదు చేసింది చేసేయడమే. పొగడ్తో తెగడ్తో కూడా తక్షణం అందేసుకుంటారు తెరమీదివారికి ఆ బాధలేదు !

**కె. సి హెచ్. గన్నేరువరం**

సంజయ్ గాంధి గొప్పతనం ఏమిటి ?

ఏం లేదని తేలిపోయింది కద !

దేవుడు కల్పితం కాదా ?

అక్కడికి ప్రపంచంలో ఏది కల్పితం కాదు

జీవితంలో తృప్తి లభించేదెప్పుడు ?

అత్యాశ విడనాడినప్పుడు!

ప్రేమ పెళ్లిపై మీ అభిప్రాయం. ?

రెండూ చేయీచేయీ కలిసి నడిస్తేనే సంసార రథం సాఫీగా సాగుతుంది.

మనిషికి సుఖాన్నిచ్చేది ధనమా? మనసా? ప్రేమా?

తృప్తి.

**జి. వి. ఆర్ విజయవాడ**

సరదాలు చాలా వున్నాయి కాని ....

ఒచ్చిన చిక్కే అది. అన్నీ సరదాలే అయితే ఏ ఒక్కదాట్లో నేర్పు రాదు !

**టి. పి. సాలూరు**

జవాబు కందని ప్రశ్న, ప్రశ్నలేని జవాబు ఎలా వుంటాయి ?

మీ ప్రశ్నలోనే వుంది కదా, వేయని ప్రశ్నకి జవాబురాదు. జవాబులేని ప్రశ్నవేయలేదు !

---

# హైదరాబాద్ నోట్ బుక్

ఈ పొట్లాలలో పులుసన్నం, పెరుగన్నం, పులిహోర ఉంటాయి. ప్రస్తుతం ఈ పొట్లాలను నగరంలో ఆరు చోట్ల— కోటీ మహిళా కళాశాల గేటువద్ద, మహిళా కళాశాల లోపల, నారాయణగూడ బాలికా పాఠశాలలోపల, సిటీ సివిల్ కోర్టు వద్ద, సచివాలయం వద్ద సికిందరాబాదులో మొండామార్కెటు వద్ద— అమ్ముతున్నారు. ఈ పథకానికి కార్మిక శాఖామంత్రి శ్రీ టి అంజయ్య ప్రారంభోత్సవం జరిపారు. హరిజన సంక్షేమ శాఖామంత్రి శ్రీ పి. మహేంద్రనాథ్ అధ్యక్షత వహించారు.

**త్వరలో అనంతపురం విశ్వవిద్యాలయం**

కేంద్ర విద్యామంత్రి శ్రీ ప్రతాప్‌చంద్రచుందర్ ఆగస్టు 18న ఇక్కడికి వచ్చినప్పుడు రాష్ట్రవిద్యా శాఖామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు ఆయనతో చర్చలు జరిపిన ఫలితంగా, ఆయన అనంతపురం పోస్ట్ గ్రాడ్యుయేట్ కేంద్రాన్ని సమగ్ర విశ్వవిద్యాలయంగా రూపొందించడం విషయమై పరిశీలిస్తానని హామీ యిచ్చారు. శ్రీకాకుళం, మాజీవీడు, కాకినాడ కడపలలో చెరి ఒక పి.జి. కేంద్రాన్ని నెలకొల్పడానికి శ్రీ వెంకటకృష్ణారావు అనుమతి కోరారు.

**తెలుగు శబ్దసాగరం**

ఇంతవరకు ప్రచురితమయిన సకల తెలుగు నిఘంటువుల పదాలు, విభిన్న మాండలికాలు, ప్రాచీనాధునిక శాస్త్ర పారిభాషిక పదాలు ఒక్కటేమిటి సకల పదాలు ఉండే సమగ్రమయిన ఒక నిఘంటువును తెలుగు శబ్ద సాగరం అనే పేరతెలుగు అకాడెమీ సిద్ధం చేస్తున్నదని దీనిలోని ప్రతిపదం వివరణ వాడుక భాషలో వుంటుందని యిది మూడు సంవత్సరాలలో సిద్ధమవుతుందని, దీనికి పదిలక్షల రూపాయలు వ్యయమవుతుందని రాష్ట్రవిద్యాశాఖా మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు ఆగస్టు 23 వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో తెలిపారు ఈ బృహన్నిఘంటువుకు పదిమంది సంకలన కర్తలు అయిదుగురు సంపాదకులు ఉంటారు. నిఘంటు నిర్మాణంలో ఏర్పడే సమస్యల పరిష్కారానికి ఐదుగురు నిపుణులున్న సలహా సంఘం ఉంటుంది. నిఘంటు నిర్మాణ కార్యక్రమమంతా తెలుగుఅకాడెమీడైరెక్టర్‌పర్యవేక్షణలోజరుగుతుంది.

**ఉపశ్రుతి :**

ఏమి సార్! కొమ్ములు తిరిగిన విద్వాంసులు కవులు, వయో వృద్ధులు — రాయప్రోలు సుబ్బారావు, కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు, తుమ్మల సీతారామమూర్తి, సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగార్ల వంటివారు ఉండగా శ్రీ దాశరథి కృష్ణమాచార్యులను ఆస్థాన కవిగా నియమించడం ఏమి న్యాయం? అనడిగారు ఒక సాహిత్యవేత్త నన్ను. జ్ఞాన వయోవృద్ధులను గౌరవించడం మంచిదనే నేనూ అనుకున్నాను. కనుక ఒకవిధంగా వారికి అన్యాయం జరిగిందనే భావించాను. కాని, మిత్రుడు దాశరథి అభ్యుదయాన్ని హర్షించకుండా వుండలేను. జవాబుకై ఆలోచిస్తున్నాను. ఇంతలో ఒక పెద్దమనిషి చేసుకొన్న వారికి చేసుకొన్నంత మహాదేవ, అన్నిటినీ మించి మరొక టేదో ఉంది. దాశరథి పూర్వపు ఆస్థాన కవుల స్థాయికి ఎదుగుతారని ఆశిద్దాం అన్నారు.

—తిరుమల రామచంద్ర

సీరియల్

# శాంతితీరం

చక్కిలం విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

**జరిగినకథ 4 :** గమ్యం తెలియకుండా ప్రయాణిస్తూ రైల్లో తారసిల్లిన మాధవిని తనతోపాటు తీసుకొస్తాడు శ్రీనాథ్ మాధవి, శ్రీనాథ్ భార్య వసంత స్నేహితులు పెళ్ళి కాకుండానే గర్భవతయిన మాధవి వసంత ఇంట్లోనే వుండిపోతుంది. బిడ్డనుకన్న మాధవి కాంక్షేసంకోసం అంటూ పట్టుపట్టి వుద్యోగంలో చేరుతుంది వేరే ఇల్లు తీసుకుని వెళ్లిపోతుంది మాధవి వసంత పట్టుదల మీద తన జీవితంలో చీకటిని వదలిపోయిన సంఘటనలను గురించి చెప్పటం ప్రారంభిస్తుంది మాధవి. బి ఏ చదువుతున్న నరేంద్రతో పరిచయమౌతుంది మాధవికి, నరేంద్రకు ప్రేమభిక్ష పెడుతుందిమాధవి.

## 9

ఆ రోజు నుండి మర్నాడు వూరు వెళ్ళిపోయింది జయ. మా వ్యవహారం జయకూ, ఆనంద్‌కూ తెలిసిపోయింది. కాబట్టి మేమిద్దరం కల్సుకోవడం తరుచుగా సాగింది. నేను 'నరేన్' అనడమూ, తను 'మధూ' అనడమూ మొదట్లోనే మొదలయింది.

ప్రేమ జీవనది లాంటిది. అది పారటం మొదలైతే ఆగటమూ, ఆవిరి కావటమూ వుండదు. ప్రేమా అంతే పురుషుడి విషయం నేను చెప్పలేనుగానీ స్త్రీ ప్రేమ ఖచ్చితంగా జీవనదే. స్త్రీ ప్రేమ హృదయంలోంచి వుబికి, వురికి వురికి పురుషుడనే సముద్రంలో తాదాత్మ్యం చెందుతుంది.

మా మధ్య ప్రేమ ఎంతటి పరిణతి చెందిందో మాటల్లో చెప్పలేను. మా మధ్య ప్రేమేకాదు, సహజమైన స్త్రీ పురుషుల ఆకర్షణకూడా తలఎత్తింది మేమూ మామూలు మనుష్యులమే. అయితే పొరపాటు జరుగకముందే రిజిస్టర్ మేరేజి చేసుకున్నాము

మా తల్లిదండ్రుల నుండీ పెద్ద అభ్యంతరం వుండకపోవచ్చుగానీ చండశాసనుడైన నరేన్ తాతగారినుండి కనీసం పరీక్షలైపోయే ధాకా ఆ విషయం దాచాలని మా అభిప్రాయం

పరీక్షలు మరో రెండు నెలలు మాత్రం వున్నాయి. ఇంతలో అనుకోకుండా ఏదో స్ట్రైక్ రైజ్ అయి కాలేజీలు మూతపడ్డాయి. అయినా మా కలయికకు అవరోధం ఏర్పడలేదు. నరేన్ వేరుగా గది తీసుకోవడం నుంచి నేను యధేచ్ఛగా వెళ్లేదాన్ని

మనం ఒకటి అనుకుంటే మరోలా జరిపించటం దైవానికి మామూలు సరిగ్గా కాలేజీలు మళ్లీ తెరిచే సమయానికి మరో విషయం బయట పడింది. నేను నెల తప్పాను ఆ విషయం నరేన్‌కు చెప్పాను, నరేన్ అది విని ఆనందంతో వుక్కిరి బిక్కిరై నన్నూ వుక్కిరి బిక్కిరి చేసేశాడు

"మరో రెండు నెలలాగు. తాతయ్యకు చెప్పి, వినకపోతే పోట్లాడి జామ్ జామ్మని తీసికెళ్లి అంతఃపురంలో వుంచుతాను ఆ తర్వాత బుజ్జిగాడు వచ్చి మా తాతయ్య బుగ్గమీసాలు పట్టుకుని ఆడిస్తాడు" అంటూ పకపక నవ్వాడు

"నరేన్, రెండు నెలలెలా ఆగేది? అప్పటికి మూడోనెల దాటుతుంది ఇంతలోనే ఇంట్లో పసిగడ్తారు. నిజం చెప్పినా గొడవచేస్తారు నిన్ను పిలిపించి మాట్లాడా లంటారు. మీ తాతగారితో సంప్రదించా లంటారు. అప్పుడైనా ఆయనకు తెలుస్తుంది గదా?"

"మధూ! నీవే ఆలోచించు. మనది కులాంతర వివాహం. దానికి మా తాతయ్య ఎంత మాత్రం సహించడు. పరీక్షలయ్యాక చెబితే అదృష్టవశాత్తూ అంగీకరిస్తే ఏ గొడవా ఉండదు. మనంత అదృష్టవంతులు యెవరూ వుండరు. లేక అంగీకరించక పోయినా పెద్ద బాధ వుండదు జరిగిపోయిన పెళ్ళిని ఆయన రద్దు చేయలేడు. కాకపోతే ఇంట్లోంచి వెళ్ళిపొమ్మంటాడు. అయినా బాధలేదు ఎక్కడో ఉద్యోగం దొరక్కపోదు. దొరకకపోయి ప్రైవేట్‌గా ఏదైనా పని చేసుకుని బ్రతకవచ్చు కానీ అదే పరీక్షలకు ముందు ఆయనకు తెలిస్తే గొడవ లేవదీస్తాడు. ఆర్థికంగా ఇబ్బంది కలిగిస్తాడు వచ్చి నానా కంగాళీ చేయొచ్చు నాకు మనశ్శాంతి కరువవుతుంది చదువు సాగకపోవచ్చు పరీక్షలు వ్రాయలేను. చదువు పూర్తికాకుండా,వుద్యోగం లేకుండా, తాతయ్య ఆగ్రహానికి గురియై ఎలా సుఖంగా బ్రతుకుతాం చెప్పు? ఒక్క రెండు నెలలాగితే ఏమవుతుంది ఏది జరిగినా అంతా సుఖాంతమే అవుతుంది ఆ మాత్రానికి ఇప్పుడే రిస్క్ తీసుకుని లేనిపోని కష్టాలు తెచ్చుకుని, వున్న శాంతి పోగొట్టుకోవడమెందుకు చెప్పు? నా భార్యగా నిన్ను నా యింటికి తీసుకు వెళ్లాలనే తొందర నాకు మాత్రం లేదా?" అంటూ నన్ను హృదయానికి హత్తుకున్నాడు నరేన్

అతని అభిప్రాయానికి నేను తలవొగ్గాను

మా వివాహం విషయం జయకు, ఆనంద్‌కు తెలుసుకాని నేను గర్భవతినని వాళ్లకూ తెలియదు ఎలాగో రెండు నెలలు గడిచి మా యిద్దరి పరీక్షలు పూర్తి అయినై

నరేన్ ఆఖరు పరీక్షకు వెళ్ళే ముందు సాయంకాలం అతణ్ణి కలుసుకున్నాను. పరీక్షల గొడవనుంచి ఈ మధ్య తరచుగా కలుసుకోవడంగానీ, కలుసుకున్నా ఎక్కువ సేపు వుండడంగానీ జరగడంలేదు చాలా రోజులతర్వాత ఆరోజు తృప్తిగా మాట్లాడుకున్నాము, మూగగా చూసుకున్నాము,



కలుపుతీరా నవ్వుకున్నాము; చివర కన్నాను రేపు వూరికి వెళ్తున్నారా?'' అని.

''ఔను, కానీ తాతయ్య దగ్గరకుకాదు. రేపు నా ఫ్రెండ్ మారేజ్. తప్పక అటెండ్ కావాలి. ఎల్లుండి రావటం, తాతయ్య దగ్గరకు వెళ్లటం, తిరుగు బండిలో రాణీ గారిముందు వాలటం'' అంటూ నా ముందు మోకరిల్లాడు.

''భక్తా, లెమ్మి'' అన్నాను నాటక ఫక్కీలో.

''ఛ, మధ్యలో కట్ చేశావు. 'భక్తా. లెమ్మి. ఏమి నీ కోరిక?' అనాలి''అన్నాడు విసుక్కుంటూ.

''ఆ మాట ఇప్పుడు కలుపుతానులే. ఏమి నీ కోరిక?'' అన్నాను నవ్వాపుకుంటూ.

లేచి, నా భుజాలమీద చేతులు వేసి ముందుకు ఒంగుతూ ''మైస్వీట్, ఒక్క ఒక్క స్వీట్...'' ఆ తర్వాత... ఆ తర్వాత గదిలో అంతా నిశ్శబ్దం!

మరునాడు నరేన్ మరో ముగ్గురు స్నేహితులతో కలిసి వాళ్ల స్నేహితుడి జీప్‌లో దగ్గరగా వున్న వో పల్లెకు వెళ్లాడు పెళ్లికి.

ఆపివేసింది మాధవి.

''పెళ్లికి వెళ్లి మళ్లీ రాలేదా? నిన్ను మోసం చేశాడా?'' ఆత్రంగా, ఆదుర్దాగా అడిగింది వసంత.

''ఔను. నరేన్ తిరిగి రాలేదు. నన్ను మోసం చేశాడు'' వెర్రిగా నవ్వింది మాధవి.

''హు! మగజాతి'' పళ్లు పటపట కొరికింది వసంత.

మళ్లీ ప్రారంభించింది మాధవి.

''నరేన్ వెళ్లిన మరునటిరోజు మా

(36 వ పేజీ చూడండి)

★ మాయాజాలం మతికట్టు ★ మాయాజాలం మతికట్టు ★ మాయాజాలం మతికట్టు ★

# ప్రతివానికి ఏదో ఒక భ్రమ కావాలి

★ మాయాజాలం మతికట్టు ★ మాయాజాలం మతికట్టు ★ మాయాజాలం మతికట్టు ★

మనిషికి భ్రాంతిని కల్పించే విద్యలు కొన్ని వున్నాయి నాటిని చేసేవానికి ఏ భ్రమా వుండదు చూసేవాళ్ళకే యిది నిజమా అనేటంత భ్రమ కలుగుతుంది

రామాయణంలో ఒక వింత సన్నివేశం వస్తుంది రామలక్ష్మణులు నశించడం కోసం రావణుడు అభిచార హోమం చేశాడట అంటే యింకొకరు బాధపడడం కోసం, కొందరు పరోక్షంగా కొన్ని పనులు చేసేవారు అని చెప్పుకోవాలి

ఇంకొకరిని బాధ పెట్టడానికి చేతబడి చేస్తారు ఇదేదో ఎదటపడి తిట్టడంకాదు, కొట్టడంకాదు, పోనీ జారిపడడానికి అనువుగా ఒక అరటిపండు తొక్కను దోవలో వేయడమా కాదు తనింట్లో తాను వుండి, వేరే యింట్లో వున్నవాడు కొన్ని బాధలు పడడానికని కొన్ని తంత్రాలు చేయడం ఇటువంటి తంత్రాలు ధీరులను ఏమీ చేయలేవు అంటే ధీరుడైనవాడు భ్రమ చెందడు, బాధపడడు

కొందరికి దయ్యాలు పడ్తాయట ఎట్లా పడ్తాయో ఏమో చెప్పలేం కాని కొందరు దయ్యం పట్టినట్లు ప్రవర్తించడం, వాళ్ళకు దయ్యాన్ని వదల్చడానికి కొందరు భూతవైద్యులు ధూపాలు, బిందెనాదాలు, బలులు, చీపురు దెబ్బలు వగైరాలు జరపడం యిప్పటికీ పలు ప్రాంతాలలో జరుగుతున్నదే

ఇటువంటి భ్రమలకు చెందిన కథలలో ప్రముఖంగా వినవచ్చే కథ — ఒకాయన దయ్యాలు మోసే మేనాలో ఎక్కి ఒక ఊరి స్మశానం నుంచి మరొక ఊరి స్మశానానికి — అవే రైలు స్టేషన్లుగా అర్ధరాత్రి ప్రయాణం చేస్తూ వుండేవాడట మేనా మోసేవాళ్ళ కోకోకోం గూడా చాలామందికి వినపడేదిట

హైదరాబాదు ప్రాంతంలో భాణామత్ అనేది ఒక ప్రమాదకరమైన భ్రమలు కల్పించే సాంప్రదాయం వుంది దానికి బలులు, తాయెతులు, వెంట్రుకలతోనూ గుడ్డముక్కలతోనూ చేతబడి చేయడం వగైరాలన్నీ వున్నాయి

విశ్వనాథ సత్యనారాయణగారు 'బాణావతి' అనే నవలే వ్రాశారు బాణామత్ బాధితులను కాపాడడానికి పాత హైదరాబాదు ప్రభుత్వంలో ఒక పోలీసు విభాగం వుండేది వాళ్ళు బాణామత్ గురువులను పట్టి, బాధితులను రక్షిస్తూ వుండేవారుట

ఇదంతా భ్రమకు లోనుగావడంలో వుంది దయ్యాలు అనే భావం, కేవలం భ్రమ దయ్యాలు లేకపోయినా, భ్రమ అనేది వుందిగదా అది బాధ కలిగించేదికదా కాబట్టే భ్రమ అనేది నిజం ఒక్కొక్కళ్లు ప్రతి పనికీ శకునాలు చూసుకుంటారు ఇది మనస్సు తృప్తికోసం

కొందరు వైద్యులు, ముట్టుకుంటేచాలు జబ్బులు పోతాయని రోగుల భ్రమ ఆ భ్రమవలన నయంఅవుతే సరే ఎట్లాగైతేనేం జబ్బు నయం కావడానికి ?

ఇంతకూ మంచి భ్రమలున్నాయి చెడు భ్రమలున్నాయి అనేది తేటతెల్లం ఎవరి నమ్మకాలు వారి కుంటాయి ప్రతి వ్యక్తీ కేవలం హేతుబద్ధమైన ప్రవర్తననే ఆశ్రయించుకున్నాడని గలనా ? భ్రమ అవసరం — భ్రమ సహజం — అన్నంతగా సలువురు ప్రవర్తిస్తూవుంటారు

కొందరికి ఏదోవిధంగా వినోదం అవసరం వినోదాలు రకరకాలు హాస్యం కొందరికి వినోదం కొందరికి తిండి వినోదం కొందరికి యింకొకరు ఏడ్వడం వినోదం ఎవని సంస్కారాన్నిబట్టి వారికి వినోదం కలుగుతూ వుంటుంది

అయితే మన దేశంలో, ప్రతివానికి ఒక కులం నెలకొని వున్నట్లే వినోదం కల్పించడానికి గూడా కొన్ని కులాలున్నాయి

దొమ్మరిమొగ్గలు, పగటివేషాలు, భోగం మేళం, గొల్లసుద్దులు, వగైరా వగైరా చాలా కులాలు మటుమాయం అవుతున్నాయి

విప్రవినోదులు ఇప్పుడెక్కడా కనపడడంలేదు బహుశా వాళ్లు వేరే ఏదో కులంతో కలిసిపోయి వుంటారు

వినోదం అంటే అందరం అర్థంచేసుకొనగలం 'విప్ర' అంటే ఏదో ఒక భ్రాంతిని, ఒక చాంచల్యాన్ని కలిగించడం

అంటే—వినోదాన్నే ఒక భ్రమగా కల్పించడం అనగా — ఏదీలేదు — కానీ వినోదం కల్పించడం శూన్యం నుంచి ఏదో వినోదాన్ని కల్పించడం

చిరకాలంగా సాగిస్తున్న వినోదం ఇది దీన్నే ఇంద్రజాలం అనీ, కనికట్టు అనీ అన్నారు యోగవాసిష్టంలో లవణరాజు కథ యిదే

పూర్వం ఒక కులమే దీనికోసం వుండేదన్నాను వాళ్లకి మంత్రదండాలు, నెమలిపింఛాలు, కాటుకలు, వగైరా లుండేవి వాళ్లనుగూడా మన దేశంలో, అన్ని వృత్తులవారినీ తక్కువగా చూసినట్లే చూసివుంటారు లేక — వారి జీవిత యాత్ర సరిగా సాగడానికి సంఘం తోడ్పడి వుండదు

ఇప్పుడు ఇంగ్లీషు చదువుకున్నవారు, పూర్వపు విప్రవినోదులు చేసే పనులలో కొన్నింటిని టిక్కెట్లుపెట్టి చూపి, మర్యాదగా బ్రతకగలుగుతున్నారు రోడ్ల ప్రక్కన ఇప్పటికీ ఇంద్రజాలం చేసి బ్రతుకుతున్నవాళ్లున్నారు దానికి టికెట్లుండవు ధర్మంచేస్తే చాలు చూసే వుంటారు రోడ్డుప్రక్క ఇంద్రజాలికుని— ఒక తీగగల డొక్కు సితారుపైన అబ్బ దాని సోకో — జబ్బలపూటి జాకెట్టు, ధుమా సిల్కు చీరంచు '' అంటూ పాడుతూ, వలయం చుట్టిన జనాన్ని అలరిస్తూ, ఈల వేసి — 'జైకాళికదేవి' అని నినాదంచేస్తూ

— భావరాజు కామేష్

## ఇంకా మిగిలివుంది

డా॥ సి నారాయణరెడ్డి

ఏమి చెప్పను నాది
ఎంత ఉన్మాదమో ?
ఏడ్పులో ఆ నవ్వు
ఇంకా మిగిలివుంది

ఎన్ని నిట్టూర్పులో ?
ఎన్ని వడగాడ్పులో ?
ఇసుకలో ఆ పువ్వు
ఇంకా మిగిలివుంది

విషపు చీకట్లు తొ
క్కిసలాడు నడిరేయి
ఎదురుగా ఆ నీడ
ఇంకా మిగిలివుంది

ఏమా జలప్రళయ
మేమి బీభత్సమది ?
ఎదలోన ఆ జాడ
ఇంకా మిగిలివుంది

దావాగ్ని తనువెల్ల
దహియించి చేసినా
ఈ కంట ఆ మంచు
ఇంకా మిగిలివుంది

ఉరిమే తుపాకి స
ర్వోదయం పలికినా
ఈ యింట ఆ చిచ్చు
ఇంకా మిగిలివుంది



# నిష్క్రమణం

ఇక్బాల్

"యువర్ గుడ్ నేమ్ ఈజ్ డాక్టర్ సారంగధర్రావ్! రూం నంబర్ 465 ప్లీజ్!" రిసెప్షనిస్టువైపు హుందాగా చూచి అటెండెంట్ వెనక వైపు పీలుస్తూ నడిచాడు ప్రొఫెసర్ సారంగధర్రావు రిటైర్డ్ ప్రిన్సిపాల్ ఐదు పదులు దాటిన సారంగధర్రావు మొఘల్—ఎ—ఆజమ్ లా వుంటాడు విశిష్టమైన ఆయన పర్సనాలిటీలో ఏదో విపరీతమైన ఆకర్షణ శక్తి దాగివుంది ఆయనవైపు రెండోసారి చూడకుండా ఎవరూ వుండలేరు క్రమశిక్షణని, ఆయన్ని చెరో ఎళ్ళెంలో పెట్టి తూస్తే మొగ్గ ఈయనవైపే వుంటుంది పెద్దకొడుకు ఐ ఎ ఎస్ ఆఫీసరు ఢిల్లీలో వుంటున్నాడు తర్వాత కూతురు ఎమ్ ఎస్ సి హోమ్ సైన్స్ చదివి హైద్రాబాద్ రిసెర్చ్ లాబ్స్‌లోని ఒక సైంటిఫిక్ ఆఫీసర్ని పెళ్ళాడింది ఆఖరివాడు ఎలక్ట్రానిక్ ఇంజనీయరు తుంబాలోని స్పేస్ రిసెర్చ్ ఆర్గనైజేషన్లో వుంటున్నాడు తనతో పనిచేస్తున్న స్టాటిస్టికల్ ఆఫీసరు మిస్ కుసుమ తన కన్ని విధాలా నచ్చిందని వాడు లెటర్ రాస్తే, తనూ ఓసారి చూచి సర్టిఫై చేద్దామని ప్రయాణమైన సారంగధర్రావు మద్రాసులో ఒక రాత్రి కోసం ఆగాడు అన్ని విధాలా ఆనందమయ జీవితాన్ని గడుపుతున్న సారంగధర్రావు కున్నదల్లా ఒకే లోటు భార్యా వియోగం ఈ వయస్సులో అన్నపూర్ణని కోల్పోవటంవల్ల తను సహధర్మచారిణినేగాక, ఒక మంచి ఫ్రెండ్, ఫిలాసఫర్ అండ్ గైడ్‌ని కోల్పోయిన వాడయేడు

నాలుగో అంతస్థులో లిఫ్ట్ నుంచి బయటపడి తాళం రూమ్‌బోయ్ చేతికిచ్చాడు వాడు సామాన్లు సర్ది పంగి విష్ చేసి వెళ్ళిపోయేక సారంగధర్రావుకి మంచి షవర్ బాత్ చేద్దామనిపించింది బాత్రూం అద్దంలో తన వంటినీ, కండల్ని చూచి ముసిముసిగా నవ్వుకుంటూ, "ఎలా వున్నావురా రంగా?" అని ప్రశ్నించుకున్నాడు ఎలా వుంటాడు? రాంగ్‌సైడ్ ఆఫ్ ఫిఫ్టీస్‌లో వున్నవాడిలా వున్నాడు సగం నుదుటిని ఆక్రమించిన నల్లటి ఉంగరాల జుట్టు స్థానంలో నిగనిగ మెరుస్తున్న బట్టతల చుట్టూ కాంపౌండు గోడలా మిగిలిన తెల్లజుట్టు వదులిచ్చిన కండరాలు కాని తన కళ్ళు ఇప్పటికీ రాక్షసి బొగ్గులాంటి ఆ మెరుపు చదువుకొనె రోజుల్నుంచీ అవే తన ఎసెట్ తనవి "ఇంటెలిజంట్ లుక్స్" అని అప్పుడే అనేవాళ్ళు అసలా మాటకొస్తే యిప్పుడు ఏ భాషలో సినీఫీల్డు చూచినా ఏభై ఏళ్ళకు తక్కువైన సినలు హీరో ఎవడున్నాడు?

షవర్ క్రింద నిలబడి ఊహల్లో తేలిపోతున్నాడు సారంగధర్రావు తన దేహదారుఢ్యం కొంతవరకూ పెద్దవాడికి వచ్చినా, వెధవకి ఒంటిని కాపాడుకోవటం చేతకాదు ఎక్కువగా తాగుతున్నాడేమో పెద్ద పొట్ట వచ్చేసింది వాడు నడుస్తుంటే గుండ్రాయికి కాళ్ళు, చేతులు మొలిచినట్లుంటుంది

స్నానం ముగించి బట్టలు వేసుకుంటుండగా తలుపుమీద ఎవరో తట్టారు

"యస్ . కమిన్!"

రూమ్ బోయ్ వచ్చాడు

"సార్! మీకేమైనా డ్రింక్స్ కావాలంటే యిప్పుడే చెప్పండి తర్వాత బార్ క్లోజ్ చేసేస్తారు"

"వాట్! డ్రింక్సా నాకక్కర్లేదు "

అన్నాడేకాని సారంగధర్రావు మనస్ఫూర్తిగా చేసిన తృణీకారం కాదది పూర్వం చాలాసార్లు తను "నో" అన్నాడు తనను గౌరవించే పదిమందిలో, తనమీద అచంచల విశ్వాసాన్నుంచిన సర్కిల్ ఆఫ్ ఫ్రెండ్స్‌లో తనకున్న 'టీ టోట్లర్' కిరీటాన్ని వదులుకోవడం యిష్టంలేక, ఒకటికి నాలుగుసార్లు "నో నో నో" అనేవాడు అలా అనేసి తన పవిత్రతను సంరక్షించుకున్నట్లు ఫీలయ్యేవాడు నిజానికి అలాటి అభ్యర్థన ఎవరైనా చెయ్యాలనీ, తను ఆమడదూరం పారిపోయి, ఆ ఉదంతాన్నంతా అన్నపూర్ణకు చెప్పాలనీ అతని మనస్సులో వుండేది మెచ్చుకోలుగా అన్నపూర్ణ చూపినపుడు కలిగే థ్రిల్ ఆ వెధవ కుంకుడురసం లాటి డ్రింక్‌లో ఏముంది?

ఇప్పుడు తన్ను మెచ్చుకోడానికి, అన్నపూర్ణ లేదు

"డామిట్! టు డే ఐ విల్ డ్రింక్ బండబారిన మనస్సు విశృంఖల విహంగంలా విహరించేవరకూ ఐ కీప్ డ్రింకింగ్ బోయ్! ఎక్కడున్నావురా?" కాలింగ్‌బెల్ నొక్కేడు

బోయ్ ట్రే నిండా డ్రింక్స్ సర్ది పట్టుకొచ్చేడు

"ఇవన్నీ ఎవరు తెమ్మన్నారు?" సారంగధర్రావు ఆశ్చర్యంగా అడిగాడు

రూమ్ బోయ్ నవ్వాపుకుంటూ రహస్యం చెబుతున్నట్లుగా అన్నాడు

"సార్! రొంబా మోసం జరిగిపూడ్సింది సార్! ఆయమ్మ సినిమాష్టార్ వుండారే కాంతిశ్రీ. ఆయమ్మ యివ్వాళ ఆర్మగం చెట్టియర్‌తో ప్రోగ్రాం ఫిక్స్‌చేసిస్తిరి రూంకూడా అడ్వాన్స్‌గా బుక్‌అయి పూడ్సింది సార్! ఇప్పుడొచ్చిందే చెట్టమ్మగారికి గుండె జబ్బు జాస్తియి పూడ్సింది చెట్టియార్ ఫోన్లోద "సారీ" చెప్తిరి ఈయమ్మ డ్రింక్సుకూడా ఆడర్‌చేసి కూర్చునుండారు ఇప్పుడేమయింది డ్రింక్ కొస్సర్ జల్సా కొన్సిల్ అమ్మకు రొంబా ఇష్టంసార్! లేదంటే వెయ్యిరూపాయలు నష్టంవుణ్ను సార్! అడడా ఏమి బ్యూటీ సార్!" గొంతు హెచ్చిస్తూ తగ్గిస్తూ, అంగాంగ విన్యాసం చేస్తూ అన్నాడు

సారంగధర్రావు నుదుట చెమటల్లు పట్టాయి అప్రయత్నంగా నిట్టూర్చాడు సారంగధర్రావు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు కళ్ళముందు చీకటి తెరలు వడివడిగా విడిపోతున్నట్లు, ఎక్కణ్ణుంచో కాంతిపుంజమొకటి తారాజువ్వలా తనవైపుకు దూసుకొస్తూ, తన కళ్ళలోకి రంగుల విస్ఫులింగాల్ని విరజిమ్మినట్లు ఫీలయ్యాడు

"సార్! " బోయ్ అర్థోక్తిగా అన్నాడు

సారంగధర్రావు పిడికిళ్ళు బిగిసాయి కణతల్లోకి రక్తం ఉరికింది

రాత్రి సగం నలిగిపోయాక మల్లెల సౌరభాన్ని తనివితీరా పీలుస్తూ తనని పెనవేసుకుపోయిన కాంతిశ్రీ నున్నటి ఒంటిని అతి ఆప్యాయంగా, జాగ్రత్తగా గాజుబొమ్మని తడిమినట్లుగా తాకాడు ఈ కాంతిశ్రీ చాలామంది కుర్రాళ్ళ గుండెల్లో నిద్రపోతుందని తనకు తెలుసు ఈమె డాన్స్

ఒక్కటుంటే ఆ సినిమా కనకాభిషేకం చేయించుకుంటుంది. ఆమె పెదవివిరుపుకోసం కొందరు, ఆచ్ఛాదన వేయని వక్షాన్ని చూడ్డానికి మరికొందరు, జఘన సౌందర్యాన్ని వర్ణిస్తూ ఇంకొందరు ఆమె సినిమాల్ని పదే పదే చూస్తారని విన్నాడు తను. ఎంతోమంది స్వప్నసీమల్ని సుక్షేత్రం గావించే ఈ అప్సరస ఈరోజు తనలాటి ముసలాడి బీటలుబారిన హృదయంపై పన్నీటిని కురిపించింది. సారంగధర్రావు చేతులు ఆమెచుట్టూ బిగుసుకున్నాయి. సౌందర్యపు ఎవరెస్ట్ అయిన ఆమె కళ్ళలో మామూలుగానే ఎర్రజీర వుంటుంది. విస్కీవల్ల, నిద్రాభంగంవల్ల అవి జ్యోతుల్లా ప్రకాశిస్తున్నాయి.

మత్తుగా తన చెవి కొరికింది. "యూ ! నాటీ ఓల్డ్ బోయ్. ది బీస్ట్ యిన్ యూ ఈజ్ అవుట్ టుడే. లెటిట్ కిల్ మీ..."



'మాయిద్దరి కథ'లో ఎన్.టి.ఆర్. మంజుల

సారంగధర్రావు గుండెల్లోకి చురకత్తులు దిగేయి.

ఒక్కోసారి కవ్విస్తూ మరోసారి "బుడ్డామిల్‌గయా !" అని నవ్విస్తూ, తను ఊహించనైనాలేని ఏవో వింతలోకాలకి 'షికార్' తీసుకెళ్ళింది. హాలూసినేషన్స్‌లోంచి నిద్రలోకి జారబోతున్న సారంగధర్రావుకి కర్ణకఠోరంగా తలుపు చప్పుడు విన్పించింది. అమలాపురంలో తన నౌకరు తలుపు 'నాక్'చేసే పద్ధతికాదది. సారంగధర్రావు కళ్ళు బరువుగా తెరిచాడు.

## నిష్క్రమణ

క్షీరసముద్రంలాటి దుప్పట్లోంచి కాంతిశ్రీ పొంకాలు తొంగిచూస్తున్నాయి. మళ్ళా సారంగధర్రావు గుండెలమీద జలపాతాలు దుమికాయి. ఈసారి తలుపు విరిగేంతటి చప్పుడయింది. క్షణకాలం తన మనస్సు కీడుని శంకించింది. "ఓహ్ ! భయపడొద్దు. అప్‌సెట్ అవకు !" తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు, సారంగధర్రావు. కాంతిశ్రీ భుజాలు పట్టి కుదిపాడు. కళ్ళు తెరచి విసుగ్గా చూచింది "ఏమిట"న్నట్టు.

జవాబు యివ్వనవసరంలేకుండానే తలుపులు భళ్ళున తెరచుకున్నాయి. సారంగధర్రావు అనిమిషుడయ్యాడు. కాంతిశ్రీ 'కెవ్వ'న కేకవేసి తన్ను చుట్టుకుంది. ఈసారి ఆలింగనం సారంగధర్రావు హృదయనందనాన్ని పూయించలేదు. నల్లత్రాచు పెనవేసుకున్నట్టు ఫీలయేడు. అప్రయత్నంగా అన్నాడు, "పోలీస్ !"

డాక్టర్ సారంగధర్రావు పరాయి ఆడదాని కౌగిట్లో వుండగా పోలీసులు చుట్టుముట్టారు. వాటె షేమ్ ! వాటె పిటీ ! ఐదు దశాబ్దాలుగా తను కాపాడుకున్న పరువు, ప్రతిష్ఠ ఒక కిరాయి ఆడదాని స్పర్శకోసం తగలెట్టేశాడు. ఇంపాజిబుల్ ! ఇదంతా ఒక పీడకల ! భగవాన్ ! ఈ కల కరిగిపోవాలి. తను త్రుళ్ళిపడి కళ్ళు తెరుస్తాడు. అమలాపురంలోని స్వంత యింట్లోనో, త్రివేంద్రంలోని కొడుకు ఇంట్లోనో నిద్రలేస్తాడు. లేచి పిచ్చికలను తల్చుకుని నవ్వుకుంటాడు. దట్సాల్ ! ప్లీజ్ గాడ్ ! ఫర్‌గివ్ మి ! కళ్ళు గిట్టిగా నులుముకుని చూచిన సారంగధర్రావుకి ఎదురుగా గదినిండా పోలీసులు, ఇన్స్పెక్టర్ కన్పించారు.

కాంతిశ్రీ బట్టలు సర్దుకుంటూ లేచి నుంచుంది.

తనింకా చచ్చిపోకుండా ఎలా ఉండగలిగాడు? ఒక్కసారి ఎటాక్ వచ్చి ఈ పాడుగుండె ఎందుకు ఆగిపోదు ?

తన్ను ఏ మిరకిల్ ఎందుకు కాపాడదు ? ఏ వటుడో వచ్చి తన్నెందుకు పాతాళానికి తొక్కెయ్యడు ?

తెల్లవారితే, పేపర్లలో ఈ విషయం ప్రింటయితే ?

మై గాడ్ ! ఆ'రేపు'ని నేనెలా ఎదుర్కోను ?

పెద్దకొడుకు ఆఫీసుకి వెళ్ళబోతూ, టై ముడి వేసుకుంటూ పేపర్లోకి చూస్తాడు. పక్కనే బాంబు పడ్డట్టు ఉలిక్కిపడతాడు. నో ! ఇటీజ్ సింప్లీ యింపాజిబుల్ !

తన ఒకే ఒక్క కూతురు అనిత మొగుణ్ణి ఆఫీసుకి పంపిస్తుంది. అక్కడ పేపరు చూచిన అల్లుడు యింటికి ఫోన్ చేస్తాడు. మొగుడి ఫోన్ కాల్‌ని అతి ఆనందంగా వినబోయిన అనిత ఈ విషయం విన్నప్పుడు, ఆమె ముఖం... నో...నో...

సారంగధర్రావు వణికిపోతున్నాడు. అప్పటికే ఆలశ్యమయిందని కుర్ర ఐ. పి. యస్. ఆఫీసరు ధుమధుమలాడుతూ వచ్చాడు. కాంతిశ్రీని చూచి,

"సో... సో... దేర్ యు ఆర్ ! మేడమ్ ! నువ్వు దొరికావంటే మా మెడకో వుచ్చు తగిలించావన్నమాటే. బిజినెస్ మాగ్నెట్స్ ! పొలిటికల్ డ్రాగన్స్ ! ఇంటలెక్చువల్స్ ! వాళ్ళని తప్పితే సామాన్యుల్ని దరిజేర్చవు. నువ్వు కేవలం విశ్వామిత్రుల కోసం నిర్దేశించబడిన మేనకవు. ప్రతిసారీ నువ్వు జారుకోవడం, నీ విటుల కోపాగ్నికి మే మాహుతి కావడం... ఆఁ ! నౌ, లుక్ హియర్ జంటిల్‌మన్ ! మీ రెవరైనా కావచ్చు. కాని నా చేతినుంచి తప్పుకోలేరు. యు కెన్ యూజ్ ఆల్ యువర్ ట్రిక్స్. నిప్పుల్లో నడవడమన్నా, సింహం జూలు పట్టి ఆడించడమన్నా నాకు సరదా ! కమాన్ ! మూవ్ క్విక్ !" సినిమా నటిని చూడగానే హీరో స్టైయిల్‌లో దంచేశాడు.

ఇంతమంది సమక్షంలో తన కొడుకులాటి వాడిముందు, తన కొడుకుకన్నా తక్కువవాడి ముందు తను దోషిగా నిలబడ్డాడు ! అంతటి విషాద సమయంలోనూ సారంగధర్రావుకి తనింకా యుక్తాయుక్తాల గురించి ఆలోచిస్తున్నందుకు నవ్వొచ్చింది. గొంతు పెగల్చుకుని అన్నాడు, "దయచేసి నన్ను బట్టలు మార్చుకోనివ్వండి. రెండు నిముషాల వ్యవధిస్తే... ప్లీజ్ !"

"ఆల్‌రైట్ !" తల ఒకవైపుకు వంచి కాళ్ళు రెండూ ఎడంగా పెట్టి చేతిలో స్టిక్ గాలిలో ఊపుతూ వయ్యారంగా అన్నాడు ఆఫీసరు.

"యు విల్ గెట్ ది లాస్ట్ టు మినిట్స్ ఆఫ్ యువర్ ఆనర్‌బుల్ లైఫ్ ! త్వరగా తెమలండి !... అండ్ మై డియర్ లేడీ ! నువ్వు కూడా !"

అందరూ బయటికి నడిచారు, కాంతిశ్రీ, తను మినహా !

మూసిన తలుపువైపు తదేకంగా జూస్తూ ప్రెస్ యింటర్వ్యూను గురించి ఆలోచిస్తున్నాడు ఆఫీసరు.

ఆ తలుపునే లోపలివైపు నుంచి జూస్తూ అనుకున్నాడు సారంగధర్రావు. "కరెక్ట్‌గా చెప్పావు బాబూ ! నా జీవితంలో ఈ రెండు నిముషాలు చాలా ఖరీదయినవి."

కాంతిశ్రీ వైపు నిర్లిప్తంగా జూచి తన గది వెనకనున్న బాల్కనీ వైపు నడిచాడు సారంగధర్రావు. నాలుగో అంతస్థునుంచి కన్పించే నగర సౌందర్యాన్ని చూడటంలేదతను. ఆఖరుసారిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాడు. బాల్కనీనుంచి గెంతేసిన సారంగధర్రావుకి కాంతిశ్రీ కేకతోగాని, పోలీసుల హడావిడితోగానీ నిమిత్తంలేదు. ●

"కన్నవారిల్లు" లో దీప →

# "అందరికీ మూడ్స్ వుంటాయి!"



సతీసావిత్రిలో వాణిశ్రీ

టాక్సీ స్టాండ్ దగ్గర నిలుచొన్న నన్ను కారులో వెళ్తున్న ఓ సంగీత దర్శకుడు ఆశ్చర్యంగా చూశాడు. డ్రయివర్ భుజం తట్టి, కారు ఆపించాడు. "ప్రసాద్ స్టూడియోకేసి వెళ్తున్నాను వస్తారా?" అంటూ తలుపు తెరిచాడు. "వాహినీ దగ్గరే నాకు కాస్త పనుంది" అని థాంక్స్ చెబుతూ, కారులో ఆయన పక్కన కూర్చున్నాను. కాస్సేపు చిత్ర లోకాభిరామాయణం మాట్లాడాక ఆయన చిటికెలువేసి కూనిరాగంతీస్తూ, తన లోకంలో తాను వుండిపోయాడు. బహుశా ఆయన యిదివరకు బాణీ కూర్చిన పాటనో, లేక ఇప్పుడు సంగీత మివ్వబోయే పాటనో మనసులో నెమరు వేసుకుంటూండవచ్చనుకొని, ఆయన్ని డిస్టర్బ్ చేయలేదు. నేను ఉన్నట్టుండి ఆయన "డ్రయివర్!" అని అరిచి, "మనది ఏ కారోయ్? ఏ మాడల్? దీన్ని ఎడ్లబండిలా మెల్లగా నడిపితే రోడ్డుమీద చూసేవాళ్ళు నవ్వుకోరూ? నీ సొమ్మేం పోయింది — వేగంగా తోలవోయ్!" అన్నాడు. పాపం, ఆ డ్రయివర్ కారు వేగం హెచ్చించాడు. మళ్ళీ ఆ సంగీత దర్శకుడు తన కూనిరాగంలో పడిపోయాడు. మరి కాస్సేపటికి ఆయన తన లోకంలోంచి తేరుకొని, "డ్రయివర్!" అని మళ్ళీ అరిచి, "ఎక్కడ ఏ కొంపలంటుకు పోయాయని ఫైర్ ఇంజన్‌లా పరిగెత్తిస్తున్నావ్ కారును? రోడ్డుమీదున్నవాళ్ళు బెదిరిపోరూ — మెల్లగా తోలవోయ్!" అన్నాడు. దాంతో ఆ డ్రయివర్ మునుపటి వేగంతోనే నడపసాగాడు. ఇంతలో వాహినీ స్టూడియో వచ్చేసింది. నేను థాంక్స్ మళ్ళీ చెప్పి, కారు దిగి వెళ్ళాను.

ఇంతకీ, చెప్పవచ్చేదేమిటంటే —

## జి. వి. జి. పేజీ

సినిమా సృజనాత్మకమైన కళ అని ఒక్క విషయంలో మాత్రం ఒప్పుకోక తప్పదు — ఇక్కడ అందరికీ 'మూడ్స్' అంటూ వుంటూంటాయి కాబట్టి.

* * *

చాలాకాలంక్రితం జరిగిన మరో విషయం. సాయంత్రం ఆరయింది. షూటింగ్ బ్రేక్ సమయంలో సెట్ బయట కొందరు నటీనటులు టిఫిన్ సేవిస్తూ, మాట్లాడుకొంటూ కూర్చొనున్నారు. నేనా పక్క ఫ్లోర్‌లోంచి వస్తూంటే, ఓ నటుడు పిలిచి, టిఫిన్ ఆఫర్ చేస్తూ, "మంచి సమయానికి వచ్చారు. మేమంతా ఇప్పుడు సత్యజిత్‌రాయ్ గురించి మాట్లాడుకుంటున్నాం. యు ఆర్ ఒన్ ఆఫ్ ది వెటరన్స్ ఇన్ ది ఫిలిమ్ జర్నలిజమ్‌కదా? ఆ గొప్ప దర్శకుని గురించి మీ అభిప్రాయమేమిటో వినాలని వుంది మా అందరికీ" అన్నాడు.

అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన ఆయన చిత్రాలగురించి [illegible]

"ఆయన తీసిన అన్ని చిత్రాల గురించీ చెప్పారుగాని, 'మహానగర్' గురించి చెప్పలేదేం? మీరు చూడలేదా?" అడిగాడా నటుడు.

చూడలేదన్నాను.

"చూడలేదా? ఐయామ్ వెరీ సారీ! నా దృష్టిలో 'మహానగర్' చిత్రం చూడనివారు సత్యజిత్‌రాయ్ గొప్పతనం గురించి పూర్తిగా అవగాహన చేసుకున్నవారుకాదు. ఆ చిత్రంలో ఫస్ట్ షాట్ ఒక ట్రామ్ పై భాగం మీంచి స్టార్ట్ అవుతుంది" అంటూ ఆయన ఉత్సాహంతో వివరించసాగాడు. ఇంతలో సెట్‌లో లైట్ ఏర్పాట్లు పూర్తయిందని పిలుపు రాగానే ఆ నటీనటులందరూ కాస్సేపట్లో మళ్ళీ వస్తామని నాదగ్గర సెలవు తీసుకొని, సెట్లోకి వెళ్ళిపోయారు.

ఆ 'మహానగర్' చిత్రం ఎప్పుడైనా వస్తే తప్పకుండా చూడాలని మనసులో నోట్ చేసుకున్నాను.

రెండురోజులయ్యాక అదే సమయానికి అదే ఫ్లోర్ బయట ఆ నటీనటులే కూర్చున్నారు. వాళ్ళ దగ్గరికి వెళ్ళగానే "సత్యజిత్‌రాయ్ గురించి మాట్లాడుకుంటున్నాం. ఆయన గురించి మీ అభిప్రాయ మేమిటి?" అంటూ ఆ నటుడే నాకు కుర్చీ చూపించాడు. ఉస్సూరుమంటూ కూర్చొని, మొన్ననగా సత్యజిత్‌రే గురించి మాట్లాడుకుంటున్న వీరు, ఈవేళ కూడా ఆయన గురించే మాట్లాడుకుంటున్నారంటే — వీళ్ళ ఉత్సాహాభిరుచులకు అభినందించక తప్పదు — అని మనసులో అనుకొని, నేనుకూడా మొన్నటిలాగే ఆయన గొప్ప చిత్రాల గురించి మళ్ళీ ఏకరువు పెడుతూ, నా జీవితంలో పోగొట్టుకున్నట్లు ఫీలవుతున్న విషయం ఒకటి. అది ఆయన గొప్ప సృష్టి 'మహానగర్'ను చూడకపోవడం నా దురదృష్టం' అని ముగించాను.

దాంతో ఆ మహానటునికి చాలా ఆవేశ మొచ్చేసింది. "ఏమిటండీ! మెడమీద తల వున్న ప్రతివాడూ 'సత్యజిత్‌రాయ్ — సత్యజిత్‌రాయ్' అని తెగ పొగిడేయడమే! అందులో మీ జర్నలిస్టులు మరీనూ. నాకు తెలీక అడుగుతాను — ఏమిటండీ ఆయన గొప్పతనం? మన భారతదేశం దారిద్ర్యంతో దౌర్భాగ్య స్థితిలో వుందని తన చిత్రాల ద్వారా ఆయన విదేశీయులకు చాటిచెప్తున్నాడు. వాళ్ళు చూసి తరించి ఆయనకు అవార్డులు ఇచ్చేస్తున్నారు. మీరంతా రాసేస్తున్నారు! ఆయన్ని ఆకాశానికి ఎత్తేస్తున్నారు! మనం గర్వపడాల్సినంతటి ఒక్క విషయం ఏముందో చెప్పండి ఆయన చిత్రాలలో? పైగా 'మహానగర్' ఒక గొప్ప కళాఖండమని, అది చూడనందుకు మీరు బాధపడతారా? అదొక చిత్రమటండీ — ఒకటే బోరు! మొదటి రీల్ అయిపోయాక నేను థియేటర్‌లోంచి లేచి, బయటకు వచ్చేశాను" అన్నాడు.

"అలాగా!" అన్నాను నేను. అంతే ఇంకేం అనగలను? ★



నురుగు అమితం
సువాసన అమోఘం
ధర మాత్రం సరసం




రు.1.00
మాత్రమే
(పన్నులు
అదనం)

# టర్కిష్ బాత్

తక్కువ ఖరీదు చేసే,
-ఎక్కువ కాలం మన్నే సబ్బు

గోద్రెజ్
ఉత్పాదన





## సినిమా

'భలే అల్లుడు'లో శారద

### అన్నీ వున్న బలే కథ

విజయ మాధవీ పిక్చర్స్‌వారి భారీ రంగుల చిత్రం అన్నపూర్ణా స్టుడియోస్‌లో నిర్విరామంగా జరుగుతూంది ఆ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న తాతినేని రామారావుగారే కథను కూడా వ్రాశారు ఒక రోజు లంచ్ బ్రేకులో తమ కథను గూర్చి వివరించారు

ఒక విందు భోజనం ఎలా వుంటుందో, ఆయన కథలో అన్నీ వున్నాయి అనిపించింది

జమిందార్‌కు స్నేహితుడిగా, ఆప్తుడుగా, ఆత్మీయుడుగా వుంటూ ఆయన ఆస్తిని అపహరించ ప్రయత్నించిన విద్రోహులపై విలయతాండవం చేసే "సాఫ్ట్ అండ్ రెబల్" పాత్ర అక్కినేనిది

వడ్డె శోభనాద్రిగారు నిర్మిస్తున్న విజయ మాధవీ పిక్చర్స్‌లో జయచిత్ర, మాధవి, వై విజయ, హలం, జయమాలిని, ఛాయాదేవి, రాజబాబు, మోహన్‌బాబు, సాక్షి రంగారావు ముఖ్య పాత్రధారులు సత్యనారాయణ, రావు గోపాలరావు గార్ల పాత్రలు భిన్నధృవాలు

విజయ మాధవీ ఎక్చర్స్‌కు సంబంధించి అయిదు పాటలను, అన్నపూర్ణా ప్రివ్యూ థియేటర్లో చాలామంది విన్నారు నాలుగు పాటలకు నూరు శాతం మార్కులిచ్చారు సంగీత దర్శకుడు రాఘవులుగారిని మెచ్చుకున్నారు

కొడైకెనాల్‌లో జరిగిన యుగళగీతాన్ని డబల్ పాజిటివ్‌ను అదే థియేటర్లో చూశారు అక్కినేనికి, జయచిత్ర 'సరయిన సరసాంగి' అనిపించింది

ఈ వర్ణచిత్రానికి సత్యానంద్ రచన్ను, సెల్వరాజ్ ఛాయను, జి జి కె కూర్పును, శరత్ రామమోహన్‌లు సహదర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు

వడ్డె రమేష్‌గారి నిర్మాణతలో జరిగే విజయ మాధవీ పిక్చర్స్‌వారి చిత్రానికి అన్నపూర్ణ, (ఆంధ్ర) నవభారత్ (సీడెడ్), శ్రీ తారకరామ (నైజాం) పంపిణీదారులు

### అక్కినేనితో ఏటా ఒక చిత్రం

విజయ మాధవీ పిక్చర్స్ బ్రదర్స్ శోభనాద్రి రమేష్ కిశోర్‌గార్లను ఈమధ్య హైద్రాబాదులో కలిశాను అన్నపూర్ణ స్టుడియోస్‌లో తమ చిత్ర నిర్మాణానికి అనుకూలించే సౌకర్యాలు వున్నాయని ముగ్గురూ ఏకకంఠంతో చెప్పారు

ఏటా ఒక చిత్రం అక్కినేనిగారితో నిర్మించే వుద్దేశ్యం తమకున్నట్లు తెలిపారు

విజయ మాధవీ పిక్చర్స్ అధినేతలను అభిరుచి, వ్యాపారదక్షత గల వ్యక్తులుగా "నటసామ్రాట్" ప్రశంసించారు

తనకున్న మంచి నిర్మాతలలో విజయ మాధవీ అధినేతలు చేరారు, అనేది అభిప్రాయం అక్కినేనికి ఏర్పడింది

### విచిత్ర జీవితం

డాక్టర్ అక్కినేని, కళాభినేత్రి వాణిశ్రీ నాయికా, నాయకులుగా నటిస్తున్న శ్రీ ఉమాలక్ష్మి కంబైన్స్ వారి వర్ణ చిత్రానికి "విచిత్ర జీవితం" అని పేరు పెట్టారు దాదాపు నెలరోజులకుపైగా హైద్రాబాద్ అన్నపూర్ణ స్టుడియోలో షూటింగ్ పూర్తిచేసుకున్న ఈ వర్ణ చిత్రంలో జయసుధ, జగ్గయ్య, గుమ్మడి, నాగభూషణం, మోహన్‌బాబు, ధూళిపాళ, కాకరాల, రామశర్మ, రమాప్రభ ముఖ్య పాత్రధారులు

'నా ప్రాణంలో ప్రాణం'లో శోభన్, జయచిత్ర



◀ 'యమగోల'లో యన్ టి ఆర్

విక్టరీ మధుసూదనరావు దర్శకత్వంలో రూపురేఖలు దిద్దుకునే ఈ రంగుల చిత్రానికి బొల్లిముంత మాటలను, చక్రవర్తి సంగీతాన్ని, వి యస్ ఆర్ స్వామి ఛాయాగ్రహణాన్ని, జి వి సుబ్బారావు కళను సమకూరుస్తున్నారు నిడమర్తి పద్మాక్షి పుష్పభట్ నిర్మిస్తున్న ఈ చిత్రం అన్నపూర్ణ విడుదల

## కీర్తికిరీటాలు అక్కినేనివి

నవలా రచయిత్రిగా ఒక ప్రత్యేకతను పుచ్చుకున్న యద్దనపూడి సులోచనారాణి ఒక విశిష్టమైన నవలను సృష్టించింది ఆ నవల పేరు కీర్తికిరీటాలు,

మార్కెట్టులో ఆ నవలకు ప్రత్యేకమైన పరపతి ఏర్పడింది చదివిన ప్రతి వ్యక్తి, ఆ నవలలోని తండ్రీ తనయుడి పాత్రలకు అక్కినేనిగారినే అనుకుంటారు

అక్కినేనిగారే ఆ నవలను కొనడం జరిగింది గాబట్టి, స్టుడియో పిక్చర్‌గా ఆ కథను నిర్మించ దలచారు గాబట్టి, ఆ రెండు పాత్రలను ఆయనే పోషించగలరని ఆశిద్దాం

''కీర్తికిరీటాలు'' చిత్రానికి ఎమ్బీయస్‌గారిని రచయితగా ఎంపిక చేశారు గనక, సంభాషణల ధోరణిలో కొత్తదనాన్ని ఎదురుచూడొచ్చు,

## దశకంఠుడిగా నటరత్న

రామకృష్ణ సినీ స్టుడియోస్‌వారి భారీ పౌరాణిక వర్ణచిత్రం ''శ్రీరామ పట్టాభిషేకము' జూలై 29న రామకృష్ణ సినీ స్టుడియోస్‌లో ప్రారంభమైంది దశకంఠుడిగా ఎన్ టి రామారావు, మండోదరిగా జమున పాల్గొన్న కొన్ని ముఖ్యమైన సన్నివేశాలను వరుసగా మూడు రోజులు చిత్రీకరించారు సెప్టెంబర్ 15 వరకూ ''శ్రీరామ పట్టాభిషేకము'' షూటింగ్ కొనసాగుతుందని, సెప్టెంబర్ 16 నుంచి ''అనార్కలి'' షూటింగ్ ప్రారంభించి, డిశంబర్ 1కి పూర్తి చేసి, మళ్లీ డిశంబర్ నుంచి ''పట్టాభిషేకము'' షూటింగ్ కన్‌టిన్యూ చేయదలచినట్టు సూపర్ స్టార్ ఎన్ టి ఆర్ పేర్కొన్నారు ''శ్రీరామ పట్టాభిషేకము'' చిత్రంలో రామ, రావణులుగా నందమూరి, దశరథుడిగా ప్రభాకరరెడ్డి, భరతుడిగా సత్యనారాయణ, లక్ష్మణుడిగా రామకృష్ణ, హనుమంతుడిగా అర్జా జనార్దనరావు, కైకేయిగ కాంచన, మందరగా సూర్యకాంతం, సీతగా సంగీత నటిస్తున్నారు ఈ చిత్రంలోని గీతాలను దేవులపల్లి కృష్ణశాస్త్రి, సి నారాయణరెడ్డి వ్రాశారు ఆ గీతాలకు పెండ్యాల స్వరమాలికలు కూర్చారు.



# సినిమా

**ర్ధాంగి చిత్రంలో పాటలు, పల్లవులు**

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి ''అర్ధాంగి'' త్రంలో మొత్తం ఆరు పాటలున్నాయి ఆరుపాటల పల్లవులేమిటో ఒకసారి పరికిద్దాం

'నా మనసే ఒక తెల్లని కాగితం
ని వలపే తొలి వెన్నెల సంతకం
అది ఈనాడైనా, ఏనాడైనా
నీకే నీకే అంకితం ''

ఈ పాటను డా సి నారాయణరెడ్డి వ్రాసారు జయసుధ, మురళీమోహన్‌లతో చిత్రీకరించారు చలపతిరావుగారి సంగీతలహరులు తోడైన ఈ పాటకు గానకోకిల సుశీల గాత్రం మరింత మధురిమ లిచ్చింది జయసుధ తొలిసారిగా తన సంపాదనలో తన భర్తకు సెన్ సెట్ ఒకటి ప్రెజెంట్ చేసే సందర్భంలో బిడియంతో పాడే పాటే ఈ గీతం

''గూడు ఒక్కటే గువ్వలు రెండమ్మా
గుండెలు రెండైనా సొద ఒకటేనమ్మా
ఈడూ – జోడూ కల్సింది
తోడూ – నీడా దొరికింది ''

ఈ పాటను వేటూరి సుందరరామ్మూర్తి వ్రాశారు



ఉమాలక్ష్మి కంబైన్సు ప్రొడక్షన్ నెం 1 లో
జయసుధ, నాగేశ్వరరావు

బాలసుబ్రమణ్యం, సుశీల పాడారు జయసుధ, మురళీమోహన్‌లు పాడే యుగళగీతం యిది

"లగ్ తుమారే — లోక్కైక జావురే
ఏక్కైక ఏక్కైక లోక్కైక జావురే"

ఈ పాటను కొసరాజుగారు వ్రాశారు బాలసుబ్రమణ్యం, విజయలక్ష్మిశర్మ పాడారు రాజబాబు, రమాప్రభలతో చిత్రీకరించారు

"హార్‌నీ సిగతరగా అందగాడా
సరసమాడ వచ్చావా సందెకాడా,
హార్‌నీ హార్‌నీ

ఈ పాటను వేటూరి సుందరామ్మూర్తి వ్రాశారు జయసుధ నెలాగైనా వశపర్చుకోవాలని వ్యర్ధ ప్రయత్నం చేస్తున్న వయసుడిగిన అల్లు రామలింగయ్యను వుద్దేశించి పై పాట పాడుతుంది జయసుధ తెరవెనుక ఈ పాటను జానకి పాడింది

"నీ మూతిమీసాలు తగిలి
బుగ్గ కందిపోనాది
ఆకురాయి చేయితగిలి అందమరిగిపోనాది"

ఈ పాటనుకూడా వేటూరే వ్రాశారు యల్ ఆర్ ఈశ్వరి పాడిన ఈ పాటకు అనుగుణంగా జయమాలిని అభినయం చేసింది

"ఇళ్లొకటి వుండగా, ఇళ్లాలు వుండంగా
ఈదిపాలెయ్యామే గురుడా!
మన కాలకర్మమ్మ
ఎనకాల తగులుకుని
మన కొంప ముంచెరా నరుడా"

ఈ పాటను జానపద గేయ రచయిత కొసరాజు వ్రాశారు తల్లీ కూతుళ్లు (సూర్యకాంతం, రమాప్రభ), పాతివ్రత్యం పేరుతో తమ భర్తల్ని (నాగభూషణం, రాజబాబు) అవస్థలు పెట్టడం

పుచ్చుకునేందుకు నిశ్చయించుకుని పై పాటకు శ్రీకారం పలుకుతారు రాజబాబుకు బాలసుబ్రమణ్యం, నాగభూషణానికి మాధవపెద్ది సత్యం, తమ గాత్రాల నందించారు

పై ఆరు పాటలు సంగీత దర్శకులు టి చలపతిరావు స్వర సారధ్యంలో స్వారస్య రాగాలను కూర్చుకున్నాయి మోహన్‌గాంధీ ప్రప్రథమంగా దర్శకత్వం వహించిన ఈ సెంటిమెంటల్ చిత్రానికి ప్రముఖ దర్శకులు ప్రత్యగాత్మగారు కథ, ట్రీట్‌మెంట్ వ్రాశారు సత్యానంద్, చలపతిరావు, సుందరబాబు, జి వి సుబ్బారావు, కృష్ణస్వామి, డామిత్రావ్ వరుసగా మాటలు, సంగీతం, కెమెరా, కళ, కూర్పు సహకార దర్శకత్వం సమకూర్చారీ చిత్రానికి నవయుగ ద్వారా త్వరలో విడుదలయ్యే ఈ చిత్రానికి ఏ వి సుబ్బారావుగారు నిర్మాత ఏ పూర్ణచంద్రరావు నిర్వహణ

↓ ఇంద్ర ధనుస్సులో కృష్ణ ↓





'దేవదాసు మళ్లీపుట్టాడు
రికార్డింగ్ ప్రారంభోత్సవంలో



'భద్రకాళి'లో విజయ, జయప్రద

## మల్లెమాల చిత్రం మొదలైంది

సహజ కవి మల్లెమాల సుందరరామిరెడ్డి రంగుల్లో భారీయెత్తున నిర్మిస్తున్న "నాయుడుబావ" చిత్రం షూటింగ్ జులై 31న ప్రసాద్ స్టుడియోలో ప్రారంభమైంది. శోభన్‌బాబు, జయసుధ పాల్గొన్న దృశ్యంతో శ్రీకారం చుట్టుకున్న ఈ చిత్రంలో జయప్రద, రాజబాబు, సత్యనారాయణ, నిర్మల, విజయలక్ష్మి, జయమాలిని, సాక్షిరంగారావు, తదితర పాత్రలను పోషిస్తున్నారు.

''మానవుడు – దానవుడు'' చిత్రం తర్వాత పి సి రెడ్డి, శోభన్‌బాబు కల్పిన చిత్రం మల్లెమాలగారి ''నాయుడుబావ''. ''మానవుడు - దానవుడు'' పెద్ద హిట్ అయింది. ''నాయుడు బావ'' కూడా హిట్ అవుతుందనడానికి అదే దర్శకుడు, అదే హీరో కారణభూతులవుతారని నిక్కచ్చిగా చెప్పొచ్చు. ఎందుకంటే రాజశ్రీ వ్రాసిన ఈ కథ అటువంటిది. అందుకు మల్లెమాల చేసిన రచన అంత మధురమైంది. కేపబుల్ కెమెరామెన్ పి యస్ ప్రకాష్ ఛాయను, సత్యం సంగీతాన్ని, మార్తాండ్ కూర్పును, భాస్కరరాజు కళను సమకూరుస్తున్న ఈ చిత్రం కౌముదీ బ్యానరుపై తయారవుతుంది.

### మూడు + మూడు + ఒకటి

భాగ్యనగరం చిత్ర నిర్మాత శ్రీ బాబుల్‌నాథ్‌ను ఆగస్టు మొదటి వారంలో రామస్వామి వీధిలోని త్రివిక్రమరావుగారి ఆఫీసులో మ్యూజిక్ సిట్టింగ్ సమయంలో కలిశాను.

నేను కలిసిన రోజున, వేటూరి సుందరరామమూర్తి ఓ జానపద గీతాన్ని, మహదేవన్‌గారి ట్యూనుకు సరిపడ అయిదే నిమిషాల్లో వ్రాసి యిచ్చారు.

మీ చిత్రంలో ఎన్ని పాటలుంటాయి? ఎవరెవరు వ్రాస్తారు? అని బాబుల్‌గారిని అడిగాను.

''చిత్రంలోని మొత్తం పాటలు ఏడు. మూడింటిని నారాయణరెడ్డి, మూడింటిని వేటూరి, ఒకపాటను దాశరథి వ్రాస్తారు. ఆ పాటలు సెప్టెంబరు యిరవైకల్లా పూర్తవుతాయి'' అన్నారు నాథ్.

''మంచి బాబాయ్''గా శోభన్ నటిస్తున్న శ్రీ బాలాజీ చిత్రవారి వర్ణచిత్రానికి ''మేరా గావ్ మేరా దేశ్'' హిందీ చిత్రం మూలం. ఈ చిత్రానికి టి కృష్ణ దర్శకుడు. శోభన్ జయచిత్ర కలిసే మూడో చిత్రం యిది. — **శ్రీనివాస్** ●

'చిల్లరకొట్టు చిట్టెమ్మ'లో జయచిత్ర, మురళీమోహన్

తననుతాను సుఖపడితే ఒకఆనందం. తనవాళ్ళనైనా సుఖపెడితే పరమానందం

ఈ రెంటికీ నోచని జీవితం.......ఏమవుతుంది?

రసవత్తరమైనకథకు రమణీయ రూపకల్పన!



కృష్ణంరాజు సమర్పించు

గోపీకృష్ణా మూవీస్

# అమరదీపం



ఈస్ట్మన్ కలర్

దర్శకుడు కె.రాఘవేంద్రరావు B.A నిర్మాత యు.వి.సూర్యనారాయణ రాజు

నిర్వహణ జయకృష్ణ

లక్ష్మీ ఫిలింస్

# అమ్మకే, రేఖారాణి ఉత్తరం

## కాకుమాను శారద




అప్పుడే మెలకువ వచ్చిన రేఖ గడియారం వంక చూసింది ఏడున్నర బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని లేస్తున్న రేఖకు దొడ్లో తల్లి గొంతు ఖంగుమని వినబడుతున్నది తననే తిడుతుందని తెలుసుకొనేందుకు ఎక్కువసేపు పట్టలేదు విసుగ్గా లేచి బాత్‌రూమ్ వైపు నడిచింది

అది రోజూ ఆ యింట్లో జరిగే భాగోతమే ప్రొద్దున్న లేచింది మొదలు రాత్రి పడుకోబోయే వరకూ తల్లికి ఒక పనిలోనూ సహాయం చేయకపోగా తల్లిచేతే తన పనులుకూడా చేయించుకుంటుంది రేఖ తెలివిగలదే, చురుకైనదేకాని ఇంటి పనిలో ఆమె కున్న నిర్లక్ష్యం, బద్ధకం మరెవ్వరిలోను చూడలేదంటుంది రేఖ తల్లిమీనాక్షి

బాంక్ మేనేజర్‌గారి ఏకైక గారాబాలపట్టి రేఖారాణి ఆమెకు ఒక అన్న, తమ్ముడు ఉన్నారు బి ఏ చదువుతున్న రేఖ "చదువుకున్న ఆడవాళ్ళు వంట చేయటంలో అర్థం లేదంటుంది" "నేను ఆ కూర చేస్తే రుచిగా వుంటుంది— ఈ పిండివంట చేస్తే బ్రహ్మాండంగా చేస్తాను" అని ఎవరైనా అంటే అదీ ఓ గొప్పేనా అని తేళ్ళికగా తీసిపారేస్తుంది అంతకన్నా మొండిగా ఎవరైనా వాదిస్తే నాకంత ఖర్మేం పట్టదు పొమ్మంటుంది

గారాబంగా పెంచుకున్నందుకు తండ్రి ఏ పనీ చెయ్యనివ్వడు ఆ అవకాశమే ఆమెను మరింత మొండిదానిగా తయారుచేసింది "ఎంత గారాబంగా పెరిగినా, ఆడపిల్ల అన్ని పనులు నేర్చుకోవాలి" అనే సిద్ధాంతము మీనాక్షిది కూతురిఎడ్ల అమితమైన ప్రేమ లేకపోలేదుకాని ఆ ప్రేమే పిల్లల బాధ్యతలని ఆటంకపరచి, భవిష్యత్‌లో నేరస్థులుగా నిలబడేటట్లు వుండకూడదు" అని వాదిస్తుంది భర్తతో

ఓరోజు "రేఖా! ఇలారా ఈ పూరీలు వత్తు" అన్నది మీనాక్షి గట్టిగా కేకలేస్తూ

"అబ్బబ్బ అవతల చదువుకుంటుంటే ఏమిటమ్మా మరెప్పుడిక యిలా చెప్పకు బోర్" విసుక్కుంటూనే ఆ పని చేసింది అలాగే ఓసారి పులిహోర చేస్తూ కూతుర్ని పిలిచింది

"నోట్సు రాసుకుంటున్నాను ఇప్పుడు రాను ఫో" అరవనట్లుగానే అన్నది మరో మూడుసార్లు పిలిచేసరికి ఇక తప్పదన్నట్లుగా లోపలకి వెళ్ళింది వండిన అన్నంలో పసుపు కలుపుతూ ఉన్నది మీనాక్షి పొయ్యమీద పులుసు ఉడుకుతున్నది

"పులిహోర చేస్తున్నాను ఇక్కడ కూర్చుని చూడు తెలుస్తుంది చేస్తే తొందరగా వచ్చేస్తుందికూడా!" అన్నది నెమ్మదిగా ఆశతో

కాని కూర్చున్నచోట నుంచి కదలకుండానే చూస్తూ వున్నది రేఖ "బోడి పులిహోర చెయ్యటం, ఎవరికి రాదు అన్నంలో, ఉడకబెట్టిన పులుసు పోసేస్తేసరి" తనలోనే గొణుక్కుంది విసుగ్గా వంట యిల్లంటేనే తగని కోపం, విసుగు అన్ని వండి అమర్చితే ఆనందంగా తినటమేతప్ప, 'అంత రుచిగా కంచంలోకి యెలా వచ్చిందీ' అన్న ఆలోచనే రాదామెకు

కాసేపటికి "ఆ పులుసుగిన్నె దింపి పాలు

పెట్టు'' అన్నది ఆ తర్వాత ''ఇవి సర్దు అవి సర్దు అది ఇలా ఇవ్వు ఇది అక్కడ పెట్టు'' అనే తల్లిమీద విసుక్కుంటూ పనంతా పూర్తిచేసి ఓ అరగంటకి ఆ ఇంట్లో నుంచి బయటపడి, మంచంమీద వాలి గాఢంగా నిట్టూర్చింది

మరోసారి పని మనిషి రాకపోతే, తల్లికి ఒంట్లో నలతగా ఉండటంతో పని అంతా రేఖ మీదే పడింది అంత పెద్ద యింట్లో పాచి పని అంతా తనొక్కతే చేస్తున్నా చూస్తూ ఊరుకోవడం, కోపం కల్గించినా ఏం చేయలేక పోయింది బట్టలన్నీ ఉతికి ఆరేస్తుండగా అప్పుడే ఊరునుంచి వచ్చిన తండ్రి చూచి ''ఏమిటి చిట్టితల్లీ! నీవు ఆరేస్తున్నావ్'' అనగానే కళ్ళలో నీళ్లు తిరిగాయి రేఖకి

''మీరూరుకోండి . చెయ్యకపోతే పనెలా తెలుస్తుంది'' అన్నది మీనాక్షి

''ఇప్పుడు దానికేం వయసు మించిందని చదువయిపోయేక నేర్చుకుంటుంది ఇప్పుడేకదా, వాళ్ళు కాస్త సరదాగా గడపగలిగేది''

''ఆఁ ఆ మీ గారామే దాన్ని చెడగొడ్తుంది మీరిలా నేర్పండి రేపు అత్తగారింట్లో, పుట్టింటివాళ్లేం నేర్పలేదని నన్ను ఆడిపోసుకుంటారు''

తండ్రి నవ్వుతూ ఏదో అనునయంగా చెప్తున్నాడు ఇక అక్కడ వుండలేక బాత్‌రూమ్‌లోకి వెళ్లి ''ఛీ! ఛీ! తనంటే అమ్మకి అసలు ప్రేమే లేదు అందుకే తనచేత అంత చాకిరి చేయించింది,'' అనుకొని వెక్కివెక్కి ఏడ్చింది

కాలం జరిగిపోతూ వున్నది రేఖ బి ఏ పరీక్షలు పూర్తిచేసే చెయ్యడంతోటే ఆమెను వెతుక్కుంటూ ఓ సంబంధం వచ్చేసింది ముందు ''టాప్'' నేను చేసుకోను అన్న తరువాత తనకు కాబోయే భర్త సిటీలో ఓ పెద్ద కంపెనీలో మేనేజర్ అని వాళ్లదో పల్లెటూరని అతని ఇద్దరన్నయ్యలు వ్యవసాయం చేస్తారని బాగా ఆస్తిపరులని బాగా చదువుకున్నవి, తన భర్తేనని తనని అపురూపంగా చూసుకుంటామని, వాళ్లు మరీ మరీ కోరారని ముఖ్యంగా వంట చేయడానికి ఓ నాయర్ కాలు కదిపితే కారు వుందని తెలియగానే వెంటనే తలూపేసింది, ''కాదని, అవునని'' చెప్పలేదు మీనాక్షి

ఓ శుభముహూర్తాన శ్రీనివాసుతో రేఖ పెళ్లి వైభవంగా జరిగింది అన్ని లాంఛనాలతో పెళ్లి అయిన నెల రోజులకే అత్తవారి ఇంట తప్పనిసరిగా కాలుపెట్టింది అక్కడ ఆడపడుచులు, తోటికోడళ్ల ఆదరణ, అత్తగారి ప్రేమను చూచి ఆశ్చర్యపోయింది తను గీసిన చిత్రాలను, అల్లికలను చూపిస్తూ కాలేజీ విషయాలు చెప్తూ, అందర్నీ నవ్విస్తూ ఆనందంగా ఓ నెల రోజులు గడిపి హైదరాబాద్‌కి భర్తతో కాపురానికి వచ్చేసింది ప్రేమగా చూచుకొనే భర్త వేళకి వండి వడ్డించే నాయర్, ఏది కావాలన్నా ప్రేమగా అమర్చే పనిమనిషి 'ముత్తి' వీలయితే సాయంత్రం భర్తతో కారులో సినిమాకో, షికారుకో, లేక ఒంటరిగా మహిళామండలిలో హాజర్ కావటం ఇలా ఆనందంగా, సాఫీగా సాగిపోతున్న సంసారం గురించి తండ్రికి లేఖలు వ్రాసింది

ఓ ఆర్నెలలు గడిచాయి ఆరోజు శ్రీనివాస్ ఆఫీసు గదిలో ఫ్రెండ్స్‌తో కలసి భోజనం చేస్తుండగా ఓ కొలీగ్ నరహరి,

''ఈ గుత్తివంకాయ కూర రుచి చూడండయ్యా మా ఆవిడ అమోఘంగా చేస్తుంది'' అంటూ అందరి ప్లేట్సులో వేసాడు చాలా బాగుందని మెచ్చుకున్నారంతా

''అసలు ఈ ఆడవాళ్లంతా యిలా రుచిగా వండిపెట్టేసి మన మనసుల్ని ఆకట్టుకుంటున్నారోయ్ మా శ్రీమతికి నామీద కోపం వచ్చిందని తెలుసుకునేందుకు కారం ఎక్కువయిన కూరే నిదర్శనం'' గట్టిగా నవ్వేస్తూ అన్నాడు మరో కొలీగ్

''ఆ కష్టం మాత్రం శ్రీనివాస్‌కి లేదోయ్ పాపం రేఖాగారికి వంట రాదట ఆమధ్య మా శ్రీమతితో అన్నారట'' సౌమ్యంగానే నవ్వుతూ అన్నాడు నరహరి

ఇంతవరకు తనకు తెలియని విషయం మరొకరికి తెలియడంవల్ల ఆశ్చర్యంగా చూసాడు వాళ్లవైపు ఇదే అదను అనుకొని ''ఏమో బాబు నామట్టుకు నాకు ప్రేమగా వండి వడ్డించలేని భార్యా, తోటలో పూచిన వాసనలేని పువ్వు రెండూ ఒకటే, వాళ్లకంటే ఓ వంటవాడే నయం'' అంటూ లేచాడు యింకో కొలీగ్ రామారావు, శ్రీనివాస్ మీదున్న అక్కసంతా కనబడకుండా వెళ్ళక్రక్కుతూ శ్రీనివాస్ ముఖం నల్లబడి పోయింది అవమానంతో తల వంచుకొని తన సీట్‌లోకి వచ్చేసాడు అతనికి పదే పదే రామారావ్ అన్న మాటలే గుర్తుకు వస్తున్నాయి మెదడు మొద్దుబారినట్లయి అచేతనంగా పైన ఫ్యానువంక చూస్తూ కూర్చున్నాడు కాసేపు ఆ పూటకి లీవు పెట్టి కోపంగా యింటికి వచ్చేసాడు ఇంట్లో శ్రీమతి లేదని, ఎక్కడికో వెళ్లిందని నౌకరు చెప్పగానే బూట్లైనా విడవకుండా మంచంమీద వాలిపోయాడు

సాయంత్రం యింటికి రాగానే నౌకరు ద్వారా అంతా విన్న రేఖ ఆదుర్దాగా కాఫీ చేసి భర్త దగ్గరకి వెళ్లి నుదుటిమీద చెయ్యి వేసింది కళ్ళు తెరచి భార్య మొహంలోకి చూసాడు వాసు

''ఏమిటి ఒంట్లో బాగుండలేదా? మీరొస్తారని నాకు తెలియదండి మిసెస్ జాన్సన్ షాపింగ్‌కి రమ్మంటే వెళ్లాను'' అంటూ భర్త చేతికి కాఫీ యిచ్చి తను తెచ్చిన చీరెలను భర్తకు చూపించింది

''ఈ చీరెలు అత్తగారు వాళ్ళకి పంపండి బావున్నవని తలొకటి తీసుకొన్నాను'' భార్య మంచి తనము చూసి మరింకేం అడగలేకపోయాడు వాసు

ఆ రోజు రాత్రే ఒక నిర్ణయానికి వచ్చిన వాడిలా నాయర్‌ని పిలిచి ''నువ్వు సెలవు తీసుకో అవసరమైతే కబురు పంపుతాను'' అని చెప్పాడు మరునాడు ప్రొద్దున్నే లేస్తూనే ఖంగారు పడిపోయింది రేఖ నాయర్ రాలేదని విని ''నేనే వద్దన్నాను'' అన్నాడు వాసు భయంతో నోరు కదపలేదు ఏదో విధంగా తనకు చాతనయినట్లు పని మనిషి సహాయంతో పచ్చడి చేసేసి భర్తకు ఇడ్లీ వడ్డించి టిఫిన్ అయిందనిపించింది భోజనం ఆఫీసుకి పంపమని భర్త చెప్పి వెళ్లగానే గుండెలో రాయి పడినంత పని అయింది రేఖకి కాసేపు ఆలోచించి బియ్యం కడిగి స్టౌవ్‌మీద పెట్టింది వంకాయ కూర వండి, చారు పెడదామనుకొన్నది ముత్తిని అడిగింది అది చెప్పిన విధంగానే, కాస్త దాని సహాయంతోనే కూర, చారు వండేసింది, తనకు తోచిన విధంగా టిఫిన్ కారేజ్‌లోఅన్నం పెడుతున్నపుడు పూర్తిగా గరిటెకు అతుక్కుపోయిన అన్నం ఓ పట్టాన రాలేదు బాగా మెత్తబడిపోయింది, మరోసారి వండటానికి టైమ్ లేదు అదే వడ్డించేసి, అన్నీ సర్ది నౌకర్ చేత కారేజీతోపాటు ''తొందరవల్ల అన్నం కాస్త మెత్తబడింది కోపం తెచ్చుకోవద్దు'' అని ఓ చీటి రాసి పంపి తరువాత తనుకూడ వడ్డించుకొన్నది కూరన్నం నోట్లో పెట్టుకోగానే వాంతి వచ్చినంత పని అయింది సరిపోని ఉప్పుతో, ఉడకని ముక్కలు, వెగటు పుట్టింది పెరుగుతో భోజనం చేసి చెయ్యి కడుక్కున్నది ఆమె మనసులో అనేక ఆలోచనలు, రాత్రికి ఏమి కూర చెయ్యాలి? . ఎలా చెయ్యాలి? ''అమ్మ వండేటప్పుడు చూసైనా వుంటే బాగుండేది అమ్మ ఎంత రుచిగా వండేది నేనూ అన్నీ వేసాను. మరెందుకు వెగటు పుట్టింది? ఆయన తిన్నారో లేదో? ఏమంటారో? భగవాన్'' అనుకొన్నది భర్త యింటికి వచ్చే సమయానికి భయంగా గదిలో కూర్చున్నది ఇంటికి వచ్చిన వాసు ''మధ్యాహ్నం వంట నువ్వే చేసావా'' అని మాత్రం అడిగాడు అంతే

ఆ రోజు రాత్రి ముత్తిచేతే వంట చేయిస్తుంటే, నాయర్ వున్నపుడు తనని కనీసం వంట యింటి వైపునా చూడనీయని రేఖ, ఈ రోజు తనచేతే చేయించటం దానికి ఆశ్చర్యం, ఆనందం కల్గించాయి ఓ విధమైన రుచి కలిగిన భోజనముతో తిన్నాననిపించాడు వాసు భర్త మౌనానికి కారణము తెలిసికూడా ఎందుకని అడగలేదు రేఖ మర్నాడు ప్రొద్దున్నే లేచి కాఫీ పెట్టి తనకు చేతనయినట్లుగా ఉప్మా చేసింది వంట దగ్గరకి వచ్చేటప్పటికి రేఖకి కళ్లవెంబడి నీళ్లు తిరిగాయి ఆ క్షణంలో అమ్మ గుర్తుకు వచ్చిందామెకు కాసేపటికి అన్నం వండి వార్చేసి, పొయ్యిమీద పప్పు కడిగిపెట్టి గోంగూర వలిచి, పెట్టి అంతా అయిన తరువాత తాలింపువేసి పక్కగా పెట్టబోయినప్పుడు గుర్తుకువచ్చింది ''కారం, ఉప్పు వెయ్యనే లేదని'' అన్నం చూడబోతే మేకుల్లా వున్నది ఇలా వుండగా పొయ్యిమీద కూర మాడువాసన కొడుతుంది గిన్నె గబగబా దించబోయి చెయ్యి కాలటంతో క్రిందకి వదిలేసింది అది క్రింద వున్న గాజు ప్లేటుని పగులగొట్టి మరీ క్రింద పడింది ఒక్కక్షణం కాలమే స్థంభించిపోయినట్లు అచేతనంగా వుండిపోయింది గబగబా మిసెస్ జాన్సన్ ఇంటికి ఫోన్ చేసింది, వంట మనిషిని పంపమని ఆరోజు వంట చాలా రుచిగా

ఆ గుటుములో వాసుకి అనుమానమువచ్చి మర్నాడు ఆఫీసుకి వెళ్ళకుండా ఇంట్లోనే వున్నాడు పచ్చివెలక్కాయ మింగినంత పనైంది రేఖకి తలనొప్పి వంకతో టిఫెన్ చెయ్యటం తప్పించుకొన్నది దొంగచాటుగా ఓ తెలిసిన ఆవిడకి ఫోన్ చేసి ఫలానా కూర ఎలా వండాలో అడిగి తెల్సుకొని ఆ ప్రకారంగానే వండేసింది అన్నం ఓ మాదిరిగా కుదిరినట్లుగానే అన్పించి, వడ్డించి భర్తని భోజనానికి పిల్చింది అన్నం నోట్లో పెట్టుకొన్న వాసుకి ఇన్నిరోజులు అణిగివున్న కోపం ఒక్కసారి తారాస్థాయి నందుకొన్నది

''ఏమిటి రేఖా ఇది ఇలాగేనా వండేది పప్పు తిని చూడు మొన్నటికి మొన్నా అంతే నిన్నా అంతే ఆ చారు, మజ్జిగకింద నీళ్లకంటే కనాకష్టంగా వున్నాయి ఇవాళా అంతే, కుక్కలు కూడ తినవు ఇదేనా మీ అమ్మ నీకు నేర్పినది లేకపోతే బి ఏ చదవగానే సరేననుకున్నావా ? ఛీ! ఛీ!'' కంచం తోసేసి విసురుగా వెళ్లిపోయాడు ఆ విసురుకి కంచం క్రింద పడిపోయి గది అంతా ఖరాబయింది కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి వెక్కి వెక్కి ఏడుస్తూ, దూరంగా వున్న అమ్మని తలచుకుంటూ మెల్లిగా గదంతా శుభ్రముచేసి సర్దేసింది

మరునాడు తల్లిని గురించి ఆలోచిస్తూ పరధ్యానంగా అన్నం వారుస్తూ గంజి చేతిమీద పడగానే, కెవ్వుమని అరిచిన రేఖ గొంతు వినగానే, ఒక్క అంగలో అక్కడకి వచ్చేసాడు వాసు ఎర్రగా కమిలిపోయిన రేఖ చేతికి బర్నాల్ వ్రాసి భార్య వైపు చూసాడు అందమైన పెద్ద కళ్లనిండా నీళ్లు ''రేఖా'' అన్నాడు జాలిగా అంతే అతని చేతులలోనే మొహం దాచుకున్నది ''నాకు వంట రాదు అమ్మ నేర్పినా నేర్చుకోలేదు'' అంటున్న రేఖను చూసి శ్రీనివాసు మనసు కరిగిపోయింది

మూడురోజుల తరువాత రేఖని తీసికొని తన ఊరు వచ్చేసాడు వాసు రేఖ ఎందుకని ఎంతగా అడిగినా 'నీవే చూస్తావుగా' అంటూ చెప్పలేదు వాళ్ల రాక ఆ ఇంట్లో అందరికీ ఆనందాన్ని పంచింది ప్రేమగా వచ్చి కౌగిలించుకున్నారు ఆడపడుచులు వాసు వున్న రెండురోజులు

# అమ్మకి రేఖారాణి ఉత్తరం

రెస్టుగానే గడచింది మూడోరోజు భోజనాలు చేస్తుండగా ''అమ్మా రేఖ ఓ నెల యిక్కడే వుంటుంది పూర్తిగా వంట నేర్పించు పాపం రాదు'' అన్నాడు ఆ విషయం విని అంతా ఆశ్చర్యపోయారు సిగ్గుతో తల వంచేసుకొన్నది ఆ మరురోజు తల్లికి ఏదో చెప్పి, రేఖను అక్కడే వదిలేసి వెళ్లిపోయాడు శ్రీనివాసు మర్నాటి తెల్లవారడంతోనే, అత్తగారి ఆరళ్ళూ, తోటికోడళ్ళ సాధింపులు, ఆడపడుచుల వెక్కిరింతలు ఎదురయ్యాయి రేఖకు ''ఏమోనమ్మ చదువుకున్న పిల్ల కావాలి అంటున్నాడుకదా అని ముచ్చటపడి చేసాము కాని, కట్టుకొన్న మొగుడికి వండిపెట్టలేదని ఏం తెలుసు ?'' అత్తగారి సాధింపు ప్రతి పనీ తనకే అప్పజెప్పి వాళ్ళంతా కబుర్లు చెప్పుకుంటుంటే ప్రక్కనేవున్న బావిలో దూకుదామనిపించింది అమ్మనయితే దబాయించి పని ఎగ్గొట్టేదికాని ఇక్కడ తనకా ధైర్యం లేదు అమ్మ చెప్పిన మాట విననందుకు తగిన శిక్ష నాకిది అనుకొన్నది'' ''ఎంత సుకుమారంగా పెంచితే మాత్రం వంట నేర్పాలని వాళ్ళ అమ్మకి తెలియదేమో చదివించగానే చాలనుకున్నారు కాబోలు,'' తోటికోడళ్ళు వెక్కిరింతగా అనుకుంటూ నవ్వుకున్నారు వాళ్లిద్దరిని మింగేద్దామన్నంత కోపము వచ్చింది ఒకప్పుడు తల్లి మాటలు గుర్తుకువచ్చి రాత్రి పడుకొన్నప్పుడు తృప్తితీరా ఏడ్చింది, మిసెస్ రేఖారాణి బి ఏ ''లే వదినా నీకు చేతకాదు'' అంటూ ఓ పెద్ద గుండిగ అన్నం అవలీలగా వారుస్తున్న పదిహేనేళ్ళ ఆడపడుచును చూసి ఆశ్చర్యపోయింది

మొత్తానికి అష్టకష్టాలుపడి ఇరవై రోజులలో అన్ని రకాల వంటలు, పిండి వంటలు రుచిగా క్షణంలో అవలీలగా వండగలిగే స్థితికి చేరుకున్నది రేఖ ఆ రోజే వాసు వచ్చాడు రేఖను తీసికొని వెళ్లటానికి 'అమ్మయ్య యింకా ఈ నరకం నుండి విముక్తి తనకు' అనుకున్నది రేఖ

బయలుదేరేముందు గదిలోకి పిల్చి పసుపు కుంకుమ యిచ్చి కళ్ళ నీళ్ళు పెట్టుకొన్నది అత్తగారు తోటికోడళ్ళ కళ్ళలో కూడా నీళ్ళు చూసి ఆశ్చర్యపోయింది ''నిన్ను అనరాని మాటలని అష్టకష్టాలు పెట్టాము మంచిగా చెప్తే నీవు మాట వినవని వాసు చేసిన బలవంతం యిది మనస్ఫూర్తిగా మేము అన్న మాటలు కాదు నీవంటే మా కందరికీ యిష్టం నిన్ను కష్టపెట్టినందుకు చిన్నదానివైన మమ్మల్ని క్షమించు'' అన్నదావిడ

వాళ్ళు తనపట్ల చూపిన కాఠిన్యం వెనుక ఆప్యాయతకు ఆశ్చర్యపోయి, ''మిమ్మలను అపార్థం చేసుకొన్నందుకు నన్ను క్షమించండి అత్తయ్యా'' లంటూ అందరి దగ్గర సెలవు తీసికొని ఒకప్రక్క ఆనందంతో అంతకు మించిన బాధతో భర్తవెంట వచ్చేసింది రేఖ

''నాయర్‌ని మాన్పించేద్దాం'' అన్నది రేఖ ఇంటికి రాగానె నాయర్ వడ్డించిన భోజనంచేసి పడుకుంటూ ''ఆ పని మాత్రం చేయకు వాడు నా చిన్నప్పటినుండి నన్నే అంటిపెట్టుకొని వున్నాడు ఇక్కడే వుండని నీకు సహాయంగా వుంటాడు'' అన్నాడు వాసు

మరునాడు తనే స్వయంగా వండి భర్తకు ప్రేమగా వడ్డిస్తూ ఎన్నడూ లేని తృప్తి పొందింది భర్త ఆఫీసుకి వెళ్లిన తరువాత తల్లికి ఉత్తరం వ్రాసి మరోసారి చదువుకున్నది

అమ్మా,

సృష్టిలో మహత్తరమైనవి రెండే రెండు ఒకటి అమ్మ రెండు ఆమె ప్రేమ అమ్మా! అనుక్షణం నాచేత ఏదో ఒక పని చేయించాలని ప్రయత్నించేసే, నిన్ను చూస్తే చాలా కోపం వచ్చేది నన్నొక అసమర్థురాలిగా నీవు కోప్పడుతుంటే, నాన్నే మంచివారని, నీవే చెడ్డదానివని, నామీద ప్రేమ లేదని చాలాసార్లు విసుగ్గా గొణుక్కునేదానిని కాని ఆ కఠిన శాసనాల వెనుక ఒక తల్లి హృదయము వున్నదని అది చూసే ఆత్రుత, ఆవేదనల వెనుక యింత అర్థం, ఆనందం ఉంటుందని గ్రహించలేకపోయాను ఇక్కడికి వచ్చిన తరువాత నీవు నాపట్ల చూపిన ఆప్యాయత విలువ కట్టలేనిదిగా కన్పించింది ఈమధ్య ఓ నెలరోజులు అత్తయ్యగారి ఇంటిలో వుండి పూర్తిగా వంట నేర్చుకొన్నాను వాళ్ళు చూపిన మార్గం, ఆదరణ నాకు అమూల్యమైన కానుక 'ఆడవాళ్ళు చదువుకొనేది వంట చేయడానికి కాదని, మోడిగా వాదించే నాలాటి ఆడపిల్లలకి, 'బోర్‌గా భావించి తప్పుకునేవారికి' నా కథె ఒక చక్కని గుణపాఠం అమ్మా! నీ ప్రేమని అపార్థం చేసుకొన్న నీ కూతురిని క్షమించు ఆయన వచ్చేవేళ అవుతున్నది నేనే స్వయముగా వండిపెట్టాలి మరి యిక వుంటానమ్మా

నీ కూతురు
రేఖారాణి

మడిచి కవరు అంటించి పోస్టు చేయమని నౌకరు కిచ్చి, టిఫెన్ తయారు చేయడానికి వంట యింట్లోకి అడుగు పెట్టింది మిసెస్ రేఖారాణి బి ఏ



## శాంతి తీరం

(18వ పేజీ తరువాయి)

కజిన్‌ను రిసీవ్ చేసుకునేందుకు స్టేషన్‌కు వెళ్ళాను. ట్రైన్ ఇంకా రాలేదు. అర గంట లేటు. విసుక్కుంటూ ప్లాట్‌ఫాం మీద పచార్లు చేస్తున్నాను. నా ముందుగా కుర్రాడు ''పేపర్, పేపర్, లాజా వార్తలు'' అంటూ అరుస్తూ తిరుగుతున్నాడు పేపర్ కొని తెరిచాను. ఫ్రంట్ పేజీలో తాటి కాయంత అక్షరాలతో వున్న హెడ్డింగ్ కనిపించింది, 'జీపు ప్రమాదం; ఐదుగురి ఘోర మరణం' కుతూహలంగా చదవసాగాను.

'హైదరాబాదునుండి బయలుదేరి సమీపంలోని గ్రామానికి వివాహ సందర్భంగా వెళ్తూన్న ఒక జీపు ప్రమాద వశాత్తూ ఒక చెట్టుకు గుద్దుకుని, పెట్రోల్‌టాంక్ అంటుకున్న ఫలితంగా డ్రైవర్‌తో సహా మొత్తం ఐదుగురు పురుషులు ముఖాలు కూడా గుర్తించ లేనంతగా దుర్మరణం పాలయ్యారు' అని వుంది జీపు నెంబరు కూడా వేశారు'' ఆగిపోయింది మాధవి ఆమె చూపులు శూన్యంలో వున్నాయి.

''మధూ, మధూ, ఏమిటి నీ వంటున్నది? ! జీపు కాలిపోయిందా ? నరేంద్ర... నరేంద్ర ... చెప్పు మధూ, అలా జరగలేదని చెప్పు. ఆ జీప్ వేరే అని చెప్పు'' వసంత ఏడుస్తోంది; కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది; కదలి కదలి ఏడుస్తోంది, మాధవి ఒళ్ళోపడి ఏడుస్తోంది

''అయ్యో మధూ ! ఇదా నీ కష్టం ! ఇదా నీ బాధ ! ఇదెక్కడి సమస్య ! ఇంకెక్కడి పరిష్కారం ! దేవుడెంత క్రూరుడు ! ఎంత కఠినుడు నీవు ఎవరికి అపకారం చేశావని ఇంత ఘోరమైన శిక్ష విధించాడు ?'' తిడ్తోంది వసంత ఆవేశంగా.

''ఊర్కో వసూ ! ఇదేనా నా బాధలో పాలు పంచుకోవట మంటే ? ఇదేనా నన్ను వోదార్చటమంటే ?'' మాధవే వసంత నోదార్చసాగింది.

''నీవు బొట్టు పెట్టుకోకుండా వుంటే ఫాషన్ అనుకున్నాను. అందులోనూ చదువుకునే రోజుల్లో కూడా నీవు బొట్టును ఎప్పుడూ అశ్రద్ధ చేసేదానివి. దేవుడు నీ కుంకుమను శాశ్వతంగా తుడిచి వేశాడా !'' తల కొట్టుకుంది వసంత.

మాధవికి కన్నీళ్ళు రావటంలేదు. ఆమె మనసు స్తబ్ధంగా వుంది. కరుడు గట్టినట్లుగా వుంది. కన్నీటి రూపంలో జారిపోవలసిన ఆవేదన గుండెలోనే ఘనీభవించిపోయింది. ఆ బరువును మోయలేని దానిలా వసంత భుజంమీద తలవాల్చింది. వసంత ఆమె తల నిమురుతూ మిమిలిపోయింది.

''ఆ వార్త చదవగానే నేను గొల్లుమని ఏడవలేదు. ప్రాణాలు లేని శరీరానికి అనుభూతులెక్కడివి ? నాకు దుఃఖమనిపించలేదు. బాధ అనిపించలేదు. గుండె పొదిలి పోలేదు. ఒక్క క్షణం నా గుండె ఆగిపోయిందనే అనుకున్నాను గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయాను. కొన్ని నిముషాల తర్వాత కళ్ళలోకి చలనం వచ్చినట్లయింది. ఎదురుగా రైలు ఆగివుంది. నేనేం చేస్తున్నానో నాకే తెలీనట్లుగా, నిలబడలేని అశక్తతతో శూన్యంగా చూస్తూ ఎదురుగా వున్న కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కి కూర్చున్నాను ఆలోచనలు లేవు, అనుభూతులు లేవు. కేవలం ఒకచోట కూర్చుని ఆ శూన్యతను అనుభవించాలనిపించి మాత్రం వుంటుంది అవి రైలూ కదిలి ఎక్కడికో తీసుకు వెళ్తుందీ అన్న స్పృహ కూడా నాకు లేకపోయింది! ఎంత సేపటికో మరి నాలో కదలిక ఏర్పడింది మనసూ, శరీరమూ పని చేయటం ప్రారంభించాయి నేను రైల్లో వున్నాననీ, రైలు పరుగెత్తుతోందనీ గ్రహించాను. ఆ వెంటనే జరిగిన సంఘటనా అర్ధమవసాగింది. ఇంకేం చెప్పను వసూ ? నాకు జరిగిన అన్యాయాన్ని గ్రహించి కరువుదీరా ఏడవకముందే అన్నయ్య నన్ను గుర్తించారు ఆ క్షణంలోనే భయంకరమైన నా బాధ వెలికి రాకుండా గుండెల్లోనే పేరుకుపోయింది. నీ కన్నీళ్ళ వేడికి అది కరిగి వస్తోంది వసూ'' మాధవి వసంత గుండెల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

వాళ్ల కష్టానికి సానుభూతిగా ప్రకృతి నల్లదుస్తులు ధరించి దుఃఖం ప్రకటించింది.

* * *

ఆ రాత్రి వసంతకు నిద్ర పట్టలేదు. ఆమెకు ఆశ్చర్యంగానూ, ఆవేదనగానూ

పుంది. మాధవి ఇంత అన్యాయానికి గురి అయిందా! మాధవి విధవా! ఈ చేదు నిజాన్ని, భయంకరమైన సత్యాన్ని నమ్మలేక పోతోంది వసంత

ఇన్నాళ్ళూ ఇదంతా గుండెల్లో దాచుకుంది మాధవి! ఒక్కర్తీ ఇంత బరువును ఎలా మోసింది! మాధవి అన్నట్లు ఈ క్రౌర్యాన్ని తను భరించలేకపోతోంది. ఈ దుఃఖాన్ని ఓర్చుకోలేక పోతోంది.

ఎంత అందమైన మాధవి! ప్రపంచంలో అందమైన వాటికే అల్పాయుష్షేమో! పాలరాతి ఫలకం లాంటి నుదుటమీద తిలకం ఎంతో ముచ్చటగా మెరిసిపోయేది అదేమోగానీ మాధవి బొట్టు పెట్టుకునేందుకు బద్ధకించేది. "అదేం?" అంటే "ఎవరికి బాబూ అంత ఓపిక!" అని విసుక్కునేది. ఆ నుదుటి అందానిది ఎంత అల్పాయుషు!

వచ్చినప్పటినుండీ చూస్తూనే వుంది మాధవి చేతులకి బంగారు గాజులు తప్ప మట్టిగాజులు వేసేదేవు గాజులు వేసుకొమ్మంటే "పోదూ" అంటూ ముఖం చిట్లించేది. ఇన్నాళ్ళూ మాధవి తననెంత మోసం చేసింది! ఆమెకు జరిగిన అన్యాయాన్ని విని తను తట్టుకోలేదని తన నుంచి దాచి ఒక్కతే ఇంత గరళాన్ని గొంతులో భరించింది! నిజంగా మాధవి ఎంత గుంభనమైంది!

ఒకనాడు మాధవి ఎంత అల్లరిపిల్ల ఎంత నిర్మలమైంది! కష్టమంటే తెలీకుండా పువ్వులా పెరిగింది. తెరలు తెరలుగా వీచే పైరగాలిలా, గలగలపారే సెలయేరులా నిర్మలంగా, ఉత్సాహంగా వుండేది తామిద్దరివీ భిన్న ప్రకృతులైనా స్నేహమనే దొన్నెలో పాలూ, తేనెలా కలిసిపోయారు

తను సరస్సులా ప్రశాంతంగా, కదలిక లేకుండా వుంటే మాధవి నిలకడలేని నదిలా గలగల పారేది; లేడిలా గంతులు వేసేది హరివిల్లులా అందా లొలికేది

అప్పట్లో తనకు అమాయకురాలనీ, వానపాములాంటిదనీ స్కూల్లో పేరుండేది ఎవరైనా ఏమైనా అంటే అమాయకత్వం కాకపోయినా తిరిగీ అని నొప్పించే కాఠిన్యం తన కుండేది కాదు అప్పుడు తన తరఫున మాధవి వాళ్ళతో జగడం వేసుకునేది. అంతకు అంతా అని తన నోదార్చేది. తనసంటే సహించేది కాదుగానీ తనకై తాను మాత్రం తన నెప్పుడూ ఏడ్పిస్తూ వుండేది ఇక తన యింటికి మాధవి వస్తే బావ శ్రీనాథ్, మాధవి యిద్దరూ కలిసి నిజంగానే ఏడ్చేదాకా వదిలిపెట్టేవాళ్ళుకాదు. లప్పుడు శ్రీనాథ్ మెడిసన్ చదువుతూ తమ యింట్లోనే వుండేవాడు, శ్రీనాథ్ చదువు పూర్తి కాగానే తామిద్దరికీ పెళ్ళి చేయాలని పెద్దల వుద్దేశం

మాధవెప్పుడూ "మిసెస్ డాక్టర్, మిసెస్ డాక్టర్" అని పిలుస్తూ వుడికించేది.

---

## రైతే రాష్ట్రపతి

పొలకుతే పొడైతే
పొపొలకు అంటెక్కడిది
పరువం పరువు లప్పితే
పాతకులకు పెరపెక్కడిది
యువత, నవత, పగ్గమెంసివ
పరపతుల పందిళ్ళ
ప్రగతి మయపో త్రాలు
పత్తాలేని పత్తలై
పడమటింట్లో పడుకున్నై
ఇందేందిర దరహాసం
సంజ్యోదరి పరివారం
పన్నిన విషవలయం
పటాపంచలైన దినం
రాజీలేని రాచరికం
రంజుచెడిన నిర్వాకం
తారుమారు చేసిన జనం
ఎగిరేసిన జనతా ధ్వజం
రైతే రాజైనాక—రాజ్యంలో కరువా?
పొలకుతే ప్రజలైనాక—పెంటలో,లోపాలా?
సహజీవన పథగామికి
సహృదయుం భూమికి
అమరిన అధిదేశానికి
అధిపతి సంజీవుడు
అతడే మన రాష్ట్రపతి
అతడే జనహృదయ నిధి.

— డాక్టర్ ఇందుర్తి ప్రభాకరరావు.

---

అది చూసి శ్రీనాథ్‌కూడా అప్పుడప్పుడూ అలా పిలిచి ఎగతాళి చేసేవాడు. "నేను ఇంకా డాక్టర్‌ను కాకపోయినా మా వసంత మాత్రం 'మిసెస్ డాక్టర్' అయికూర్చుంది అనీ నవ్వేవాడు కొంటెగా. స్కూల్లో కూడా మిసెస్ డాక్టరే అవవలసిందిగానీ ఆ ప్రమాదాన్నుంచి మాధవే తప్పించింది. ఎవరైనా అలా అంటే— అమ్మో— బ్రతికేవారేనా!?

వసంత ఆలోచనా సముద్రంలో కొట్టుకుపోతోంది. అలా ఆలోచిస్తూ ఎంతసేపు మేల్కొందోగానీ తెల్లవారు ఝాము నెప్పుడు నిద్రపట్టింది. తిరిగి మెలుకువ వచ్చేసరికి ఒళ్ళంతా నెప్పులు, కళ్ళు మంటలు; బాగా దాహం వేస్తోంది గోడనున్న గడియారం చూసింది దాదాపు పది గంట లవుతోంది శ్రీనాథ్ కూడా లేనందువల్ల వసంత నెవరూ లేపలేదు. రాత్రి అర్జంట్ పని వుందంటూ హైదరాబాదు వెళ్ళాడు అతని కీ మధ్య నర్సింగ్ హోంకు క్రొత్త బిల్డింగ్ కట్టించే ప్రయత్నంలో బొత్తిగా తీరిక లేకుండా పోయింది.

ఇది శ్రీనాథ్ స్వంత వూరు. పెద్ద పట్నమూ కాదూ, మరీ పల్లెటూరూ కాదు. ఒకప్పుడు పల్లెలోనే లెక్క అయినా ఇప్పుడిప్పుడే హైస్కూలూ, సమితి ఆఫీసూ, పశువుల ఆస్పత్రీ, సినిమాహాలూ మొదలైనవి వెలసి పురోగమిస్తోంది. శ్రీనాథ్ డిగ్రీ తీసుకోగానే మేనమామ కూతురు వసంతను పెళ్ళి చేసుకుని ఉద్యోగానికి కనీసం ప్రయత్నమైనా చేయకుండా ఇక్కడికి వచ్చి డిస్పెన్సరీ ఓపన్ చేశాడు. ఇది జరిగి దాదాపు ఐదేళ్ళవుతోంది.

శ్రీనాథ్‌కు తల్లిలేదు. అతను పుట్టినప్పుడే బాలింతవాతం కమ్మి, సకాలంలో తగిన వైద్యం అందక చనిపోయింది. తండ్రి రెండేళ్ళ క్రితం కాశీలో ప్రొఫెసర్‌గా వున్న పెద్దకొడుకు దగ్గరకు వెళ్ళిపోయాడు, వృద్ధాప్యంలో కాశీ విశ్వేశ్వరుని సన్నిధిలో గడపాలని. ఆయన వెళ్ళాక ఎప్పుడూ రాలేదు. శ్రీనాథే ఒకసారి వెళ్ళి చూసి వచ్చాడు. శ్రీనాథ్ అన్న శ్రీధర్ తన వాటాఆస్తి అమ్ముకునివెళ్ళి కాశీలోనే సెటిల్ అయ్యాడు. ప్రస్తుతం ఇక్కడున్న ఇల్లు, చీనితోట, పదెకరాల మాగాణి శ్రీనాథ్‌వే. ఇంటికి వంద గజాల దూరంలో తన వాటాలోకి వచ్చిన ఖాళీ స్థలంలో నర్సింగ్ హోం నిర్మించాలని అతని వుద్దేశం. ఇప్పుడదే ప్రయత్నంలో బిజీగా వున్నాడు. ఇంతకుముందు ఇంట్లోనే వరండా ప్రక్క గదిని డిస్పెన్సరీగా వుపయోగించేవాడు.

వసంత లేవబోయి లేవలేక అలాగే పడుకునేసింది. అమ్మగారెంతకూ లేచి రాకపోవడంతో పనిపిల్ల లక్ష్మివచ్చి "అమ్మగారూ, లేవండి. చాలా పొద్దుపోయింది" అంటూ పిల్చింది.

బరువుగా కళ్ళు తెరచి "బాబేడీ ?" అంది

"మాధవమ్మగారు శలవు పెట్టార్ట. ఇంట్లోనే వున్నారు. 'ఈ వేళ్టికి వుండనీలే' అన్నారు" అంది లక్ష్మి.

ఉలికిపడింది వసంత.

మాధవి శలవు పెట్టిందా?! రాత్రి ఇంటికి వెళ్దాం రమ్మని ఎంత బలవంతం చేసినా నిర్లిప్తంగా నవ్వుతూ "ఫరవాలేదు వసూ. ఒకటిన్నర సంవత్సరం నుంచీ ఈ నిప్పు నా గుండెల్లో వున్నదే. ఈ రోజు కొత్తగా నన్ను కాల్చివేయదు. నన్నువెళ్లనీ. నీవు మాత్రం నా గురించి దిగులుపడకుండా హాయిగా నిద్రపో. కొత్తగా దిగులు పెంచుకునేందుకు ఈ సమస్య కొత్తదేం కాదు. కాకపోతే నీకు తెలియడం మాత్రం కొత్త" అంది.

తనకు తెలుసు, పైకి ఎంత గంభీరంగా, ప్రశాంతంగా వున్నా మాధవి ఎదలో అగ్ని పర్వతాలు బ్రద్దలౌతున్నాయని. మాధవికి ఈ కష్టం క్రొత్తది గాకపోయిగా మాను తున్న పుండును క్రొత్తగా గెలికింది తను. ఆ బాధను వోర్చుకోవడం కష్టమే. అయినా మాధవి బాధను తను మరోకలా వూహించుకుంది. ఆమె సమస్యను మరో విధంగా మనసులో మలుచుకుంది. తనకు శ్రీనాథ్‌కూ తెలిస్తే ఏ విధంగానైనా పరిష్కారం ఆలోచించి మాధవి బ్రతుకును మంచి బాటలోకి మళ్లేలా చేయాలని అనుకుందేగానీ ఎవరూ సరిచేయలేని, వెనుదిరిగి పోలేని ముళ్లబాటలోకి తోసి వేయబడింది

## శాంతి తీరం

మాధవి అని తనకు తెలీదు. మన వూహకు కూడా అందని సంఘటనలు సృష్టించడం దైవానికి మాత్రమే సాధ్యం.

వసంత పరధ్యానాన్ని చూసి మళ్లీ పిలిచింది లక్ష్మి.

"ఊఁ" అంది వసంత.

వసంతకేం తోచలేదు. మాధవి మామూలుగా స్కూలుకు వెళ్లివుంటే కొంతలో కొంత బాగుండేది. శలవు పెట్టిందంటే ఖచ్చితంగా మాధవి మనసులో కుమిలిపోతూ వుండాలి. తను వెళ్లివుంటే బాగుండేది. కానీ కదలడమూ, కళ్ళు తెరవడమూకూడా సాధ్యంకావడంలేదు. పోనీ మాధవినే రమ్మందామంటే అలాంటి బాధలో అలా చెప్పి పంపడం బాగుండదు.

వసంత పరిస్థితి పసిగట్టి అనుమానంగా అడిగింది లక్ష్మి "ఒంట్లో బాగా లేదా అమ్మగారూ ?" అని.

"ఊహూ, బాగానే వుంది. వెళ్లి కాస్త వేడికాఫీ తీసుకురా. ఆ తర్వాత వెళ్లి బాబును తీసుకురా" అంది 'మనసు బాగా లేనప్పుడు ఎంత విసిగిస్తున్నాడో మాధవిని' అనుకుంటూ.

లక్ష్మి క్రిందికి వెళ్లిపోయింది. వసంత అతి కష్టంమీద లేచి అటాచ్డ్ బాత్‌రూంలోకి వెళ్లి ముఖం కడుక్కొని వచ్చింది.

లక్ష్మి కాఫీ ఇచ్చి మాధవి ఇంటికి బయలుదేరింది. వసంత పరిస్థితి చెప్పకుండా వుండలేక పోయింది, తాళంవేసి రమ్మనిచెప్పి ముందుగా, కంగారుగా వచ్చేసింది మాధవి.

మాధవి వచ్చేసరికి వసంత కళ్ళు మూసుకుని పడుకునివుంది. ఒళ్ళు సలసల కాగుతోంది. ముక్కుల్లోంచి వేడి సెగలుగా వస్తోంది వూపిరి. వసంత పక్కన మంచం మీద కూర్చుంటూ వసంత చేతిని తన చేతిలోకి తీసుకుంది మాధవి. వసంత బరువుగా కళ్ళు తెరిచింది.

మేఘాలు విడిపోగా భగ్గున మండుతూ బయటపడిన వడిమింటి సూర్యుల్లా వున్నాయి కళ్ళు!

మాధవినిచూసి "మధూ..." అంది నీరసంగా.

మాధవి "నే చెప్పలేదూ..." అని అంటూ వుండగానే

"నిన్నంతా బాగా అలసటయింది కదూ అట్లూ, ఇట్లూ తిరిగి. అందుకని కాస్త ఒళ్ళు వెచ్చబడింది" అంది వసంత. నిన్నటి విషయాలు మళ్లీ గుర్తుచేసుకుని మాధవిని బాధ పెట్టడం ఇష్టంలేదు వసంతకు. అందుకే మాట తప్పించింది.

ఇంతలో బాబును ఎత్తుకుని లక్ష్మి వచ్చింది. తాళంచెవి మాధవి కిచ్చింది. మాధవి క్రిందకు దిగివెళ్లి డిస్పెన్సరీలో తనకు తెలిసిన రెండు జ్వరం మాత్రలు తీసుకుని తిరిగి పైకి వచ్చింది, లక్ష్మి వసంత తల వడ్తోంది.

మాధవి "లక్ష్మీ, వెళ్లి వేడి వేడి కాఫీ తీసుకురా" అంది.

బాబు మంచం పక్కన నిలబడి వసంతను అందుకోవాలని చేతులు చాపు తున్నాడు.

లక్ష్మి బాబును తీసుకుని వెళ్లిపోయింది.

మాధవి వసంతను చూస్తూ కూర్చుంది జ్వర తీవ్రతలో పెదిమలు అదురుతున్నాయి. భారంగా ఊపిరి తీస్తోంది.

'శ్రీనాథ్ వుంటే ఎంత కంగారు పడేవారో' అనుకుంది మాధవి.

లక్ష్మి రెండు కప్పుల్లో కాఫీ తీసుకుని వచ్చింది. వసంతను లేపి మాత్రలు వేసి కాఫీ త్రాగించింది మాధవి.

"నీవూ తీసుకో" అంది వసంత నీరసించిన గొంతుకతో.

"గిన్నెతో చన్నీళ్ళూ, తెల్లని గుడ్డా తీసుకురా లక్ష్మీ" లక్ష్మిని పురమాయించి కాఫీ కప్పు అందుకుంది మాధవి.



# ఎవరు నువ్వు?

నేను గోడవైపు తిరిగి
చెదరిన మనశ్శకలాల్ని
ఏరుకుంటూంటే,
నిశ్శబ్దంగా వచ్చి
కనులు మూసే
నీ వెవ్వరు ?
చిన్ననాటి చెలిమికాడవా ?
చిలిపిచేష్టల చిన్నారివా ?
నీ చేతులింత
చల్లగా వున్నాయేమి ?
కెవ్వుమని అరిస్తే ?...
"నువ్వు పుట్టినక్షణమే
పుట్టాను నేను
ఇది మనం కలవ్వలసిన ముహూర్తం"
అని చెవిలో గుసగుసలాడే
నీవెవ్వరు ?
నీ ఊర్పుల ఈదరగాలి
నా గుండెల్లోకి వీస్తోంది
గజగజలాడిస్తూ.
ఎవరు నువ్వు ? ఎవరు నువ్వు ?

— పి. జి. రామారావు



# శాంతితీరం

లక్ష్మి తెచ్చాక గుడ్డ నీళ్లలో తడిపి వసంత నుదుటిమీద వేసింది.

కప్పులు తీసుకుని వెళ్ళిపోయింది లక్ష్మి.

వసంత మాధవినే చూస్తోంది.

'బొట్టు లేకపోయినా అదో అందమే' అని అనుకునే మాధవి బోసిపోయిన నుదురు ఈ రోజు కొత్తగా వెలవెల బోయినట్లు అనిపిస్తోంది.

తామర తూడుల్లా, కోమలంగా వున్న చేతులకు రంగు రంగుల గాజులు లేక పోవడం ఎంతో లోటుగా కనిపిస్తోంది.

బంగారు గాజులు మాధవి ఒంటి రంగులో కలిసిపోయి కనిపించడమే లేదు. నిన్నటి వరకూ అదో స్టైల్‌గా అనిపించేది. దాని భావం తెలిశాక ఈ రోజు చూసి సహించ లేక పోతోంది మనసు.

(ఇంకా వుంది)

# మెరుపులో చెరుపు

పోతుకూచి సాంబశివరావు




శ్రీనివాసరావు కారు నడుపుకుంటూ గారేజి బయటకు వచ్చాడు. మలుపులో కారు మెల్లిగా డ్రైవ్ చేసుకుంటూ జనం అడ్డు తప్పించుకుంటూ మెల్లిగా పోనిచ్చాడు. ఇంతలో ఎవరో యువతి ఎదురుగా కారు ఆపమని సైగ చేసింది.

''మిస్టర్ నన్ను రైల్వేస్టేషనుదాకా దింపగలరా ?''

ఆ అపరిచయ యువతి ప్రశ్నించడం శ్రీనివాసరావుకు ఆశ్చర్యం కలిగింది. ఎక్కించుకుందామంటే తనకోసం రోడ్డు మీద నిలుచున్న అపర్ణ జ్ఞప్తికివచ్చి తట పటాయించాడు.

''నేను స్టేషనువైపు వెళ్ళడంలేదండీ!'' అన్నాడు శ్రీనివాసరావు.

''మరెటువైపు వెడుతున్నారు ?''

''బజారు వైపు'' అనాలోచితంగా అన్నాడు శ్రీనివాసరావు.

''ఫరవాలేదు బజారుదగ్గర దింపండి — చాలు.''

ఇంక కాదనలేక ఆమెను వెనుకసీటులో కూర్చోమన్నాడు. ఇంతలో కారు కదలగా రోడ్డుమీద ఉన్న అపర్ణ మామూలుగా వచ్చి కారుముందు సీటులో శ్రీనివాసరావు ప్రక్కన కూర్చుంది.

ఒక క్షణం కారులో మరొక యువతి కనిపించడంవల్ల ఈర్ష్య కలిగి, ''ఎవరు'' అంది అపర్ణ ప్రశ్నార్థంగా. ''ఎవరో బజారుదాకా లిఫ్టు యిమ్మంటే సరే అన్నాను.'' అన్నాడు శ్రీనివాసరావు ముభావంగా. అయితే అపర్ణ మనస్సు సమన్వయం పొందలేదు. కానీ ఆ క్రొత్త యువతి ఎవరితో మాట్లాడలేదు.

శ్రీనివాసరావు, అపర్ణ వివిధ విషయాలు ఏవో చర్చించుకుంటున్నారు. ఇంతలో అపర్ణ దిగవలసిన స్థలం వచ్చింది —

''ఆమెను ఎక్కడ దింపుతారు?'' అంది అపర్ణ అసూయా దృక్కులతో.

''మీరేమీ అనుకోకండి— దిగమంటే దిగి పోతా'' అంది ఆ క్రొత్త యువతి — అపర్ణ వైపు దీర్ఘంగా చూస్తూ.

''క్షమించండి — ఆ వుద్దేశ్యంకాదు. బజారు ముందేగా! అలాగే వెడుతున్నా — అక్కడ దింపేస్తా! అన్నాడు'' శ్రీనివాసరావు.

అపర్ణ కారుదిగిపోయి రుసరుస నడిచి పోయింది.

ఆమె పలకరించింది. ''మీ పేరు'' చెప్పాడు శ్రీనివాసరావు.

''మీపేరు ఎక్కడోవిన్నా... నాటకాలలో మీరు నటిస్తూంటారా ?''

''అవును.''

ఒకసారి మిమ్మల్ని రవీంద్రభారతిలో చూశాను — ఏదో నాటకంలో అంది ఆ యువతి.

''అలాగా! మీకు నాటికలంటే యిష్టమా ? మీ పేరు ? ఏం చేస్తూంటారు ?''అన్నాడు శ్రీనివాసరావు.

''నా పేరు లత—ఎం. ఏ. చదువుతున్నా నాకూ నాటకాలంటే యిష్టం — అదేకాదు నేనూ నటిస్తా కాలేజీలో...''ఆమె అర్ధ స్ఫోరకంగా ముగించింది.

# వె:ర:పులో చెర:పు

"చాలా బాగుంది— మీ పరిచయం నాకు అదృష్టం— మా నాటకాల్లో నటిస్తారా? నాకో మంచి నటి కావాలి" అన్నాడు శ్రీనివాసరావు.

"తప్పకుండా... కాని యిప్పుడు కాదు చదువు అయిపోయాక అంది లత.

"మళ్లీ మీరు కనిపిస్తారా!" అంటూ శ్రీనివాసరావు తన ఫోను నెంబరు. చిరునామా లతకు యిచ్చాడు.

"ఇంక ఆపండి కారు" అంది లత.

"ఇక్కడేనా దిగిపోవడం? మీ యిల్లెక్కడ! అక్కడ దింపుతా" అని యింకా ఆసక్తి చూపించాడు. లత కిలకిలా నవ్వింది అతని ఆసక్తి గమనించినట్లు.

"అవసరం వచ్చినపుడు చెబుతాను— నేను ఎక్కడ వుండేదీ" అంటూ నవ్వుతూ దిగిపోయింది లత.

శ్రీనివాసరావుకు యీ ప రి చ య ం చిత్రంగా వుంది. లతమీద ఆసక్తి పెరిగింది. స్ఫురద్రూపి, అందమైన శరీరం— లత ఆకారంలో ఉత్తమ లక్షణాలు కనిపించాయి. ఆమెను తన నాటకాలలో ఎల్లాగైనా చేర్పించి ఆమె విలువకు తగిన ప్రతిఫలం అందివ్వాలనుకున్నాడు— కాని ఆమె కలిస్తేగాని— ఇది ఎలా సాధ్యం?— శ్రీనివాసరావు చింతాక్రాంతుడైపోయాడు— బహుశా ఇది కలయేమో అనుకున్నాడు.

పనులమీద ఇంక తిరగాలనిపించలేదు— అటూ ఇటూ కాస్త పని ముగించుకొని ఆలోచనతో ఇంటికి వచ్చేశాడు శ్రీనివాసరావు అపర్ణ ఆలోచన వచ్చింది. ఆమె తన్నుపెళ్లి చేసుకోవాలని ఎంతో ఆశతో వుంది. అపర్ణ లతకంటె అందగత్తె. కాని లత తన ప్రజా జీవితానికి, నాటక రంగానికి పనికివచ్చే విద్యావంతురాలు. లత మళ్ళీ కనిపిస్తే బాగుంటుందనుకున్నాడు. ఒంటరిగా నడుంవాల్చాడు మంచంమీద భోజనం ముగించుకుని... అపర్ణతో వివాహమయితే యీ ఏకాంతంపోయి సందడి పెరగవచ్చు. అని నవ్వుకున్నాడు శ్రీనివాసరావు.

టెలిఫోన్ మ్రోగింది.

"హల్లో" స్త్రీ కంఠం.

శ్రీనివాసరావు, "ఎవరు" అని ఆశ్చర్యపోయాడు.

"గుర్తుపట్టలేదా మిస్టర్"

శ్రీనివాసరావు తబ్బిబ్బైపోతున్నాడు ఇంత రాత్రి తనకోసం ఫోనుచేసే నారీ లలామ ఎవరూ అని—

". నేనే. . మీ నాటకాలలో చేరాలనే నటిని—" అని కిలకిల నవ్వింది. శ్రీనివాసరావుకి అర్థం అయింది

"లతా? ఎక్కడినుంచి?"

"మా యింటినుంచి!"

"మీ ఫోన్ నెంబరు?"

"అంత కంగారెందుకు— త ర వా త చెప్తా "

"ఏమిటి విశేషాలు "

"ఏముంది— మా అక్క, బావ,సినిమాకి వెళ్లారు— ఇంట్లో చంటి, పెంటి భోంచేసి పడుకున్నారు. మరి నే నెవరితో మాట్లాడేది— అందుకు మీకు ఫోనుచేశా!"

"వెరీగుడ్" అన్నాడు శ్రీనివాసరావు

"మీరు గుడ్లు తింటారా?" అంది లత.

"అదేమిటి — ఆ మాటెందుకు?"

"మీరన్న మాటేగా—గుర్తువచ్చి అడిగా నాకు ఆమ్లెట్లు చాలా యిష్టం రోజూ వో గుడ్డు గుటకాయస్వాహా చేస్తాను." కిలకిల నవ్వింది లత.

"అలాగా—నాకు మరోరకమైన గుడ్లు యిష్టం—అవి పగులగొట్టి గుంజతో చట్నీ చేసి తింటా" అన్నాడు శ్రీనివాసరావు

"అవేం గుడ్లండీ?" అంది లత ఆశ్చర్యంగా.

"అవే—వెలక్కాయలు" పకపక నవ్వాడు శ్రీనివాసరావు.

"మీరు ఏనుగా? వెలగపండు గుంజు తినేసి డొక్క వదలగలరా!" మళ్లీ నవ్వింది లత.

"గుంజు —డొక్క — రెండూ తినాలని వుంది." శ్రీనివాసరావు ఛలోక్తి నర్మగర్భంగా తోచింది లతకు.

"మీకు పెళ్లి అయిందాండి" లత ప్రశ్న.

"లేదు."

"అలాగా—నాకు ముగ్గురు పిల్లలు."

"నాతో ఛలోక్తి ఆడుతున్నారా!"

"లేదండీ! నిజం" పకపక నవ్వింది లత.

# ఒకే కుటుంబంలోని సభ్యులకు భద్రత వున్నది

బిఐ గిర్లింగ్ కుటుంబంలోని బ్రేక్ స్పేరులు—పేరు గుర్తుంచుకోండి. మీ బ్రేక్ విధానంలో మారుగా అమర్చవలసివచ్చిన ప్రతిసమయంలోనూ వాటికోసం చూడండి. సురక్షితంగా మీరు ఆధారపడ్డదగ్గ పేరే అది-అన్ని వేళలా.

బ్రేక్ స్పేరుల స్థానంలో కొత్తవి అమర్చవచ్చు—కాని మీ ప్రాణం విషయంలో కాదు. చవకరకం బ్రేక్ స్పేరులు ఉపయోగించి జీవితంతో ఆడుకోవద్దు.

కృతిమమయిన లేక చవకరకమయిన బ్రేక్ స్పేర్లు—ప్రాముఖ్యం లేని రబ్బర్ వాషర్ అంత చిన్నవయినా—మీకు ఎంతగానో అవసరం వచ్చినప్పుడు పనిచేయవు. బ్రేకింగ్ భద్రత కాపాడబడడానికి మీరు మారుగా అమర్చినవి అసలయిన పరికరాల వంటివేనని ధృవపరచుకోడానికి ఎంతో మెలకువ కావాలి.

మీ బ్రేకులు భద్రంగా వుండడానికి అసలయిన బిఐ గిర్లింగ్ బ్రేక్ స్పేర్లని అధికార హోదాలో వున్న డీలర్లనుంచే కొనండి.

ఉచితం! ఉత్తమయిన బ్రేకింగ్, బ్రేకింగ్ భద్రతల గురించి అమూల్యమయిన సూచనలు ఎన్నోవున్న ఇంగ్లీషు పుస్తకం. మీ పేరు చిరునామా విడి అక్షరాలలో స్పష్టంగా తెలిపి ఈ పుస్తకం కోసం వ్రాయండి.




బ్రేక్స్ ఇండియా లిమిటెడ్
పాడి, మద్రాసు-600 050.




SAA/BI/2665/TEL

## రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.







# మెరుపులో మెరుపు

"ఛ! మీ వయసు చూస్తే పెళ్ళి కానట్లుంది."

"పైకి అలాగే వుంటాను — పెళ్లి అయిన మాట నిజం — అయితే ప్రస్తుతం నేను ఒంటరిగానే వుంటున్నా"

"పిల్లలతోనో ?"

"కాదు! అక్కపిల్లలతో" మరీ నవ్వింది లత.

"నా కంతా అయోమయంగా వుంది"

"సరిలెండి! ఈ సారి చెబుతాను కథ వివరంగా!" ఇంకా విశేషాలు

"ఏమీ లేవు—మీ ఫోను నెంబరు చెప్పారు కాదు"

"అవసరమైతే చెబుతాగా ఇదిగో ఫోన్ పెట్టేస్తున్నా" లత కంగారుగా ఫోన్ పెట్టేసింది

అంతా కలగా తోచింది శ్రీనివాసరావుకు.

నాలుగు రోజుల తరువాత.

లత వెతుక్కుంటూ తనింటికి వచ్చింది. తన పోర్షన్‌లోకి ప్రవేశించి అంతా చోద్యంగా చూస్తోంది. అది బ్రహ్మచారి కొంపలాగ, అంతా చిందర వందరగా పడివున్న పరిస్థితి చూసి, ముక్కు మూసుకుని కుర్చీలో చతికిలపడింది.

"మీరొస్తారని తెలియదుగా— లేకపోతే— శుభ్రంగా పెట్టివుంచేవాడిని."

"అలాగా! మీకు శుభ్రం అక్కర్లేదా! అంతా ఇతరులకేనా."

"అవును" నవ్వాడు శ్రీనివాసరావు.

లత కబుర్లలో పడింది ఒకరికొకరు తమ నిజ కథలు చెప్పుకున్నారు. లత మాటలు నమ్మక తప్పలేదు శ్రీనివాసరావుకు ఈ గజిబిజి గదిలో కూర్చునేకంటే, దూరంగా ఎక్కడికైనా పోయి కాస్త చల్ల గాలి పీల్చుకోవచ్చుగా! లత సూచించింది. శ్రీనివాసరావు, లత కారులో పార్కుకు పోయి కూర్చున్నారు. వేరుసెనగలు, ఐస్ క్రీమ్స్, బఠానీలు యింకా ఒక్కొక్కటే తింటూ తమ కాలేజీ చదువులు, చిన్నతనం కథలు—యింకా ఎన్నో నెమరు వేసుకున్నారు కబుర్లతో కేరింతలతో చాలా సన్నిహితమై పోయారు.

లత తన యం. ఏ. పరీక్షలు వ్రాసి, ఆవూరు విడిచి హటాత్తుగా వెళ్ళిపోయింది వెళ్లాక ఒక వుత్తరం వ్రాసింది. తాను శ్రీకాకుళంలో వున్నానని— కాని చిరునామా యివ్వలేదు శ్రీనివాసరావు మనస్సు చిక్కుల్లో పడింది. ఆమె గురించి ఆలోచనలు పెరిగాయి కాని ఏం లాభం లత తనంతట తాను కలిస్తేగాని ప్రయోజనంలేదు

ఒకరోజు హఠాత్తుగా లత పెట్టె, బెడ్డింగులతో యింటికి వచ్చేసింది శ్రీనివాసరావుకు ఆశ్చర్యం వేసింది అలావచ్చి తన ఒంటరివాసంలో చేరిపోవడం — శ్రీనివాసరావుకు ఉక్కిరిబిక్కిరి అయింది. ప్రక్కింటి వారి ప్రశ్నలకు, ఇంటి యజమానుల సందేహాలకు తగు సమాధానాలు చెప్పలేక పోయాడు. మెల్లిగా లతకు ఉద్యోగం యిప్పించి దూరంగా ఒక గది అద్దెకు చూపించి ఆమెను మెల్లిగా పంపాడు — అయినా లత రాకపోకలు సవ్యంగానే వున్నాయి.

లతను శ్రీనివాసరావు నాటకాలలోకి దింపాడు. క్రొత్తగా కొంత బిడియపడినా, లత పూర్వ నాటకానుభవం పుంజుకొని ఆరితేరింది. రెండు నాటకాలలో నాయికగా నటించి ప్రేక్షకుల మన్ననలు పొందింది.

ఒకరోజు ఈశ్వరుడు నాటకాన్ని చూడడానికి వచ్చి... "మీరు సినిమాల్లో నటిస్తే యింకా రాణిస్తారు" అన్నాడు.

"నాకు సినిమాల్లో నటించడం చాలా యిష్టం" అంది లత.

ఇంక ఈశ్వరుడు ఆమె వెంట పడ్డాడు ఆమె ఈశ్వరుని అరిచేతిలో వైకుంఠం చూసి సమ్మోహితురాలైంది — ఎలాగైతేనేం శ్రీనివాసరావుకు తెలియకుండా రెండు సినిమాల్లో ఎక్స్ట్రావేషం వేసింది దానితో లత త్వరలో తాను సినీతార కాబోయే ఆలోచన లోకంలో విహరింపసాగింది.

ఒకసారి శ్రీనివాసరావు తన క్రొత్త నాటకం రోజున నటించడానికి రిహార్సలుకు రమ్మంటే "డబ్బెంత యిస్తారు" అని వ్యాపార సరళిలో అడగడం శ్రీనివాసరావుకు చాలా బాధ కలిగించింది. దానితో శ్రీనివాసరావుకు లతకు భేదాభిప్రాయాలు అగాధంగా మారి, వారిని దూరంచేసాయి.

లత నటించిన సినిమాలు రెండేళ్లయినా బయట పడలేదు. డబ్బు తక్కువయిందనీ, పాటలు యింకా చిత్రీకరించలేదనీ ఏదో

## ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

### నమస్కారాన్ని గురించి

చిన్నవాళ్లు పెద్దవారికి నమస్కారం చేస్తే పెద్దలు పిన్నలను దీవించడం సంప్రదాయం అయితే యిది పరిచితుల విషయంలోనే ఎక్కువగా కానవస్తుంది. కొత్తవారు తమకంటే వయసులో కాస్త చిన్నవారయినా వారికి నమస్కారం చెయ్యడం ఉన్నది జాబులలో అపరిచితులైన చిన్నవారికి నమస్కారం చెప్పడం అందరూ ఎరిగినదే!

పరిచితులైన చిన్నవారికి పెద్దవాళ్లు నమస్కారం చేస్తే తప్పుగా భావిస్తారు. అలా నమస్కరించడం శపించినట్లున్నూ, తమపైని కోపాన్ని వ్యక్తం చేస్తున్నట్లున్నూ అనుకొంటారు ఇకపోతే చిన్నవాళ్లు పెద్దవారికి నమస్కారం చెయ్యకపోతే అగౌరవపరిచినట్లు అనుకుంటారు.

కొన్ని యేండ్ల క్రిందట ఒక పత్రికలో ఈ నమస్కారాన్ని గురించిన చర్చవచ్చింది. రామాయణంలో రాముడు భరతుడికి నమస్కారం చేసినట్లున్నదనీ, అలా నమస్కారం చెయ్యవచ్చునా? అనీ, వాల్మీకి మహర్షి యెందుకిలా వ్రాశాడనీ విమర్శించారొకరు. దానికి తగిన సమాధానం ఇచ్చినట్లు గుర్తులేదు.

కాశీలో ఉన్నప్పుడు సర్వశాస్త్రాలలోనూ మహా విద్వాంసులైన బాలకృష్ణ మిశ్ర గారితో ఎక్కువ పరిచయం వుండేది నేను 'నమస్కార' మంటే ఆయన 'మనస్కార' మనేవారు మొదట్లో నాకు ఆశ్చర్యమనిపించేది ఆయన నవ్వుతూ "మీ నమస్కారం వినయ విధేయతలను, నాయందలి గౌరవాన్ని సూచిస్తున్నది అది నా మనస్సుకు ఆకర్షకంగా ఉన్నది కాబట్టి "మనస్కారం" అన్నాను.' అని సమాధానం చెప్పేవారు. అధిక్షేపంగానో, నక్క వినయాలు చూపుతూనో పెట్టే వంకర దండాలు మనస్కారాలు కానేకావు.

నమస్కారమంటే ఏమిటనే ప్రశ్న చాలా చిన్న వయస్సులోనే నాకు కలిగింది. అప్పుడు గురువులను అడగ్గా "మీకంటే నేను తక్కువవాడను; నాకంటె మీరు గొప్పవారు అనే అభిప్రాయాన్ని సూచించే కరతలద్వయ సంయోగం— అంటే కేల్మోడ్పు" అని వారు వివరించారు అది ఎంతో సముచితంగా కానవచ్చింది. దీనినిబట్టి చూస్తే వయస్సుతో దీనికి సంబంధం ఉన్నట్లు తోచదు పెద్దవాళ్లు వయస్సులో చిన్నవాళ్లకి నమస్కరించడం తప్పా, ఒప్పా? అనే సందేహానికే అవకాశం లేదు.

పల్లెటూళ్లలో— అందులోనూ చదువు తక్కువ వారు "నమస్కారాలండీ!" అని చెప్పక "దండాలండీ" అని అంటారు. జాబుల్లో "అనేక దండములు పెట్టి వ్రాయునది" అని వ్రాస్తూ ఉంటారు దండమంటే దండప్రణామం అని అభిప్రాయం. అదే సాష్టాంగ నమస్కారం.

దండమంటే వంపులులేక సరిగా ఉన్న కర్ర దానిని నేలమీద పడవేసి ఉంటే అది పడుకున్నట్లు ఉంటుంది ఆ దండం వలెనే చేతులూ, కాళ్లూ, రొమ్ము, లలాటం, మున్నగు వాటిని నేలకు ఆనించి చేసే నమస్కారం దండప్రణామం అవుతుంది అది మామూలు నమస్కారం కంటె కొంత విశిష్టమైనది ఎక్కువ వినయ విధేయతలను వ్యక్తం చేస్తుంది.

వినయ విధేయతలనూ, గౌరవాన్నీ, భక్తినీ వెల్లడించే నమస్కృతులయే సరియైనవి అధిక్షేపం మొదలైన వాటిని సూచించేవి సరియైనవి కావు ఏవి యదార్థమో, ఏవి కపటమైనవో ముఖంలోని భావాలను బట్టే గ్రహించడానికి అవకాశంఉంటుంది ★

---

సాకు ఈశ్వరుడు చెబుతూనే వున్నాడు. సినీతారగా మారడానికి యింకా స్నేహాలు పెంచుకోవాలని ఈశ్వరుడు నచ్చచెప్పగా, లతకూడా ఏదో ఆశతో విశృంఖలంగా, విచ్చలవిడిగా సినీ నిర్మాతలు, దర్శకులు అన బడే వారి కెందరికో తన యవ్వనం, సుఖం పంచి యిచ్చింది. చివరకు సినీమాలలో క్రొత్త పాత్రలకు ఆమె సరిపడలేదనే అభిప్రాయం వెలికి వచ్చింది. ఈశ్వరుడు కుదిర్చిన యింటి పోర్షనువారు అద్దెబాకీ నిలదీసి అడిగారు. విలాసాలకు అమ్మడు పోయి, డబ్బు మితిమీరి ఖర్చుచేసి ఆరోగ్యానికి కళంకాలు తెచ్చుకుంది లత. చివరకు ఆమె మానసిక విచ్ఛిన్నస్థితి క్షయలా రూపొందిందిందని వార్త వెలువడింది.

ఒకరోజు కిషన్ ఆస్పత్రిలో లతనుచూసి శ్రీనివాసరావు ఆశ్చర్యపోయాడు. లత తనంతట తనే ముందుకు వచ్చి పలకరించింది. అందమైన ఆకారం రివటలా సన్నగా మారిపోయింది. కండ్లు గుంటలు కట్టి లోనికి పోయాయి. పేలవంగా నవ్వింది. శ్రీనివాసరావుకి అర్థం అయింది— స్నేహితుడు కిషన్‌కి గట్టిగా చెప్పాడు— ఆమెకు మంచి మందులిమ్మని— తాను ఖర్చు భరిస్తానని కూడా. లత సన్నగా బలహీనంగా నవ్వింది. ఎక్కడ వుంటున్నది లత చెప్పలేదు— శ్రీనివాసరావు అడిగినా, ఎప్పుడైనావచ్చి కన్పిస్తానంది అంతే—

ఆ రోజు ప్రొద్దున్నే లేవకుండానే కిషన్ ఆరుగంటలకే ఫోన్ చేసాడు. చూడాలంటే తక్షణం ఘోషామహల్‌కి వెళ్లి లతనుచూడమన్నాడు. ఎడ్రసు తీసుకొని వెళ్లాడు శ్రీనివాసరావు తక్షణం. అక్కడికి చేరగానే లత మంచానికి బల్లిలా అంటిపెట్టుకుని వుంది. అక్కగారు, ముగ్గురు పిల్లలతో ఆమెను చుట్టుముట్టారు పిల్లల గోల— లత కళ్లు బలవంతంగా తెరిచింది ఎదురుగా శ్రీనివాసరావును చూసి పేలవంగా నవ్వింది— దగ్గరగా రమ్మని పిలిచింది—

"వీళ్ళు నా పిల్లలు " లత మాటలు పెకలటంలేదు. అక్కవైపు చూసింది

"నన్ను క్షమించండి" శ్రీనివాసరావు వైపు చూసింది ఆఖరి చూపుగా! ఆమె శ్వాస తెగిపోయింది శ్రీనివాసరావు కన్నీటి చారలు హృదయాన్ని తడిపివేశాయి శ్మశానానికి వెళ్లి ఆమె దహనం దగ్గరుండి జరిపించాడు

జీవితంలో వెలుగు పొందవలసిన లత పొరపాటు భ్రమల వలలోపడి చితికి ఆహుతి అయి అగ్నికీలల మెరుపుల్లో ఆరిపోయింది— శ్రీనివాసరావు నిట్టూర్చాడు.

# పరిష్కారం ఇదే

సి. జయలలిత



''హాయ్ శశీ! బాగున్నావా? భలే కలిశాంగదా! అబ్బ! ఎన్నాళ్ళయిందో నిన్ను చూసి.''

ఎవరో పిలవటంతో ఉలిక్కిపడి, వెనక్కి తిరిగిచూసిన శశికి, ట్రాఫిక్‌నుకూడా లెక్కచేయకుండా కళ్లప్పగించి చూసేవాళ్ళని పట్టించుకోకుండా తనవైపు దాదాపు పరిగెత్తుకొచ్చి ప్రశ్నల వర్షం కురిపిస్తున్న సుషమనుచూసి ఆశ్చర్యంతో నోట మాట రాక నిలబడిపోయింది.

''ఏమిటీ, మర్చిపోయావా నన్ను, ఇన్నాళ్ళ తర్వాత కలుసుకుంటే ఎలా ఉండాలి అసలు, చూడండి బావగారూ?''

అంతదాకా వీళ్లనే చూస్తూఉన్న సుధాకర్ ఆ అమ్మాయి తననే పల్కరించటంతో కొంచెం తికమకపడ్డాడు. ఆ అమ్మాయి చొరవకు కొద్దిగా ఆశ్చర్యపడ్డాడుకూడా.

''ఎంత చెడ్డా ఫ్రెండుమకదా, తప్పే వంటారా?'' ఈ లోకంలోకి వచ్చాడు సుధాకర్.

''జానండి మీ రన్నది నిజమే. ఏం శశీ పదండి అలా నడుస్తూ మాట్లాడు కుందాం'' ముందుకు దారి తీశాడు సుధాకర్.

''మర్చిపోలేదుకాని ఇక్కడ ఇలా కన్పించటంతో ఆశ్చర్యపోయాను అంతే. అవునూ ఇక్కడెందుకున్నావు'' నెమ్మదిగా అడిగింది శశి.

''రమ్మని పిలవాల్సిందిపోయి, ఇక్కడున్నావు! ఎందుకు? ఇలా అడగటం భావ్యమేనా! పైగా పెళ్లికికూడా పిలవలేదు — ఘోర తప్పిదం. క్షమించరాని నేరం.''

ముందు నడుస్తున్న సుధాకర్‌కి మాటలు విన్పించి నవ్వు వచ్చింది.

''సరే. నాకు అర్జంటు పని ఉంది. మర్చిపోతానేమో'' శశి దగ్గరగా వచ్చి భుజంమీద చేతులేస్తూ అన్నాడు సుధాకర్.

ఉలిక్కిపడింది శశి.

నవ్వి అన్నాడు సుధాకర్. ''అంత బెస్టు ఫ్రెండులా ఉంది — మరి పెళ్లికి వచ్చినట్లు లేదే —''

''రాలేదు తనకి పిలుకాలేదు'' అబద్ధం తను అసలు వెడ్డింగ్‌కార్డు ఇవ్వలేదు. లేదు ఇంకా అక్కడ ఉంటే సంభాషణ పెరుగుతుందని వచ్చేశాను''

అందుకే అడిగాడు సుధాకర్.

''మీ ఫ్రెండు విషయం చెప్తే ఎంతో సంతోషిస్తావు అనుకున్నాను.''

''బావుంది, ఫ్రెండు కలవటం మామూలే. కలిసిన ఫ్రెండు పిలవటం మామూలే. ఇందులో అంత సంతోషం నాముంచి దాచటమెందుకు. నాకు తెలియకూడనిదా, మనమధ్య రహస్యంగా ఉంచాల్సిందేనా?''

ఒక్కసారి అతని కళ్లలోకి సూటిగా చూసి, తల దించుకొని అంది. శశి, ''నేను మీనుంచి దాచాలనుకోలేదు ఏదీ. నెమ్మదిమీద నేనే అన్నీ తెలియజేయాలనుకున్నాడు సమయం రాలేదని— ఆగాను. ఇప్పను సుషమతో స్నేహం సాగిస్తే— రాకపోకల్లో, మాటల సందర్భంలోనే, మీకు నా విషయం తెలుస్తుంది అలా తెలిస్తే ఎంత ప్రమాదమో అని భయపడ్డాను మీ మీద నమ్మకం లేకకాదు నాఅదృష్టం మీదనాకే నమ్మకంలేదు అందుకే సుషమనుదూరంగా ఉంచదలిచాను'' కాసేపాగి అంది శశి.

''నేను చదువుకునే రోజుల్లో నాకు ఒకతనితో పరిచయం ఏర్పడింది— అతన్ని కలుసుకోవడానికి నాకు సహాయపడింది సుషమ ఎప్పుడతన్ని కలవాలన్నా సుషమ సాయమే తీసుకునేదాన్ని— పెళ్లికూడా చేసుకొనదలిచాను. కాని అందరిలాగే అతనూ పెళ్లిమాట ఎత్తితే మళ్లీ కన్పించకుండా మాయమయ్యాడు అలాంటి వాడితో స్నేహం చేసినందుకు నన్ను నేను నిందించుకున్నాను ఆతరువాత కొద్ది రోజులకే మన పెళ్లి నిశ్చయమయింది''

ఊపిరి బిగపట్టి అంతాచెప్పి, నెమ్మదిగా అంది శశి— ''పేరు అనవసరం అని చెప్పలేదు. చెప్పనా?''

''అఖ్ఖరలేదు'' అతని కంఠంలో దృఢత్వం చూసి చలించింది శశి.

ఆలోచించాడు సుధాకర్.

వోదార్పు వాక్యాలు, అనునయ వాక్యాలు ఎన్నిచెప్పినా, తన మనసులో శశి స్థానం ఏ మాత్రం మారలేదని, మారదని చెప్పినా, తప్పు చేశానన్నా భావం, తప్పిపోదు మనసు నుంచి తానేదో ద్రోహం చేసినట్లు ఫీలవు

స్తాం, మరోసారి కల్సుకుందాం'' సుషమ పిలుస్తున్నా వినిపించుకోకుండా, గబగబా నడిచి సుధాకర్ ప్రక్కకి వచ్చింది.

''అదేమిటి? అప్పుడే అయిపోయాయా కబుర్లు — ఇంకెంతసేపు ఇలా గడుస్తుందో అనుకున్నా —అన్నట్లు ఇంటికి పిలిచావా''

''ఆఁ ఎంతసేపు మాట్లాడుకున్నా తరగని కబుర్లు ఉంటూనే ఉంటాయి. అందుకని ఇంటికి పిలవలేదు పిలవచ్చు లెండి, ఇక్కడేగా ఉండేది — మళ్లీ కలవకుండానే ఉంటామా'' సంభాషణ అపు చేస్తున్నట్లుగా అంది శశి.

* * *

పనంతా ముగించుకొని, చేతులు తుడుచుకొని, బయటికి వస్తున్న శశి, పడక్కుర్చీలో పడుకొని నవ్వుకుంటున్న సుధాకర్‌ని చూస్తూ అడిగింది.

''ఏమిటి? మీలో మీరే నవ్వుకుంటున్నారూ''

''ఏంలేదు—అదే మీ ఫ్రెండు, రోడ్డు మీద పలకరించటం, ఆ చొరవ చూసి''

''అదా'' ముఖం చిట్లించింది శశి.

''మొత్తానికి భలే తమాషా అయినపిల్ల సుమా'' పడక్కుర్చీ లోంచి లేస్తూ అన్నాడు సుధాకర్.

''ఇక్కడే ఉంటుంది గాబోలు ఇంక సుషమ—అవును కి పెళ్ళయి భర్తతో వచ్చినది ఇంక ఇక్కడ ఉండక ఎక్కడుంటుంది? కాని తమ స్నేహం త్రుంచేయటమా, మానటమా? ఒకవేళ స్నేహం పొడిగించి రాకపోకలు సాగిస్తే — అమ్మో — ముందు ముందు ఏమవుతుందీ — పోనీ ఆపేద్దాం అంటే ఎలా?'' తనలోతాను ఆలోచిస్తూ టేబిలు ముందరున్న కుర్చీలో కూర్చుంది శశి.

''ఏమిటి ఆలోచన. మీ ఫ్రెండు గురించే, ఇక మీరిద్దరూ కలిస్తే నన్ను సుషమ ... అకతాయిపిల్ల. చంచలమైన మనస్సు. పెళ్ళి నిశ్చయమయిపోయిన దగ్గర్నుంచి తమ స్నేహం త్రుంచేసే ప్రయత్నాల్లోనే ఉంది తను. ఇందుకు కారణం — కేవలం సుషమా? తనకు ఉన్నభయం కాదూ?''

''ప్చ్'' నిట్టూర్చింది శశి.

''ఏమిటి స్నేహితురాలి విరహం భరించలేకున్నానా?''

నవ్వి లేచింది శశి.

* * *

''ఇవాళ మీ ఫ్రెండు కన్పించింది.''

''ఉహూ'' ఏ మాత్రం ఆసక్తి లేని ఆ ప్రవర్తనచూసి కొద్దిగా ఆశ్చర్యపడ్డాడు సుధాకర్.

''వాళ్ళ ఇంటి అడ్రస్ ఇచ్చి రమ్మంది మనల్నోసారి''

''అహ'' మామూలుగా అంది శశి.

సుషమ ప్రస్తావన వచ్చినప్పుడల్లా శశిలో మార్పు గమనిస్తూనే ఉన్నాడు. సుధాకర్.

''ఏమయి ఉంటుందబ్బా కారణం'' ఎంత ఆలోచించినా అంతుబట్టలేదు అతనికి.

మొన్నొకసారి అంతే. బట్టలకొట్లో చీరలు చూస్తున్న శశి, సుషమ షాప్‌లోకి రావటంచూసి గబగబా యివతలికి వచ్చేసింది. కాని సుషమ ఒదలలేదు. ''హాయ్ శశీ, బట్టలు ఖరీదు చేయటానికి వచ్చావా? అయిపోయిందా వెళ్తున్నావు?'' అడగనే అడిగింది.

''లేదులే మరోసారి వద్దామని, వస్తాము ఇంకా చాలా పనుంది బయట.''

చిన్నబుచ్చుకొని చూస్తున్న సుషమను చూసి, బయటకు వచ్చాక అడిగాడు తను.

''అదేమిటి శశీ, పాపం తనేమనుకుంటుంది''

''ఏమిటో నాకు మాట్లాడాలనిపించ చాల్సిన పనముంది

''అయితే ఎప్పుడు వెళ్దాం''

''వెళ్దాంలెండి, తొందరేముంది. ఒక ఊళ్ళో ఉండేవాళ్ళమేగా ఎప్పుడయినా వెళ్లొచ్చు.'' లోపలికి వెళ్ళబోయింది శశి.

* * *

సుషమది ఎంత చంచల మయిన స్వభావం అయినా తమ ప్రాణ స్నేహానికి అడ్డు రాలేదు. సుషమ గురించి సుధాకర్ పట్ల తనకు భయంలేదు. సుధాకర్ మనసు తనకు తెల్సు. సుషుమ పెళ్లయ్యాక మారకుండా ఉంటుందా? చిన్నతనపు చిలిపి చేష్టలు పెళ్లి అయ్యాక మానివేసే ఉంటుంది. అలాగని స్నేహం సాగిస్తే, పాత వ్యక్తులు కలిస్తే, పాత సంగతులు వెలికి రాకుండా ఉంటాయా? అప్పుడు — ఏ మగవాడయినా, తన భార్య పూర్తిగా తన సొత్తు అనే అనుకుంటాడు. ఎంత మంచి మనసున్నా. ఇలాంటివి తేలిగ్గా తీసి పారవేసే హృదయ వైశాల్యం ఎందరిలో ఉంటుంది? అతన్ని మధ్య పరచాలని తనకు లేదు. ఎన్నిసార్లు చెప్పాలని ప్రయత్నించ లేదు ఎప్పటికయినా చెప్పేతీరాలి — తన మనసులో భారం మోయలేదు.

ఆలోచిస్తూనే పన్లు ముగించుకొని, సుధాకర్ వద్దకు వచ్చింది శశి.

''పన్లన్నీ అయినట్లేనా'' సాలోచనగా అడిగాడు సుధాకర్.

''ఆఁ ఏం'' నవ్వుతూ అతని ప్రక్కగా వచ్చి కూర్చుంటూ అంది శశి.

''నే నొకటి అనుగుతాను చెప్తావా?''

''ఏమిటది?'' భయపడ్తూనే అడిగింది.

''స్నేహితురాలు కనిపిస్తే పల్కరించటం, పల్కరించక పోవటం నీ ఇష్టం అనుకో, కాని తన ప్రస్తావన వచ్చినా, తను ఎదురైనా, నీలో ఏదో మార్పు నాకు గోచరిస్తోంది. ఎందుకీ మార్పు ఏమిటది తుంది. ఆ భావాన్ని, గతాన్ని పూర్తిగా తొలగించాలంటే పరిష్కారం ఇదే.

''చూడు శశీ, నేనూ నీకు ఒకటి చెప్పాలి. అది నాకు ఉషకు ఉన్న స్నేహం దాదాపు మాది ఇంతేననుకో. పెళ్లి దాకా కూడా వచ్చాం. నా కంటే బాగా, డబ్బు, హోదా ఉన్న వరుడు దొరకగానే, తనని మర్చిపొమ్మంది. అలాంటి చంచల స్వభావిని నమ్మినందుకు నేను పశ్చాత్తాప పడ్డాను గతాన్ని మర్చిపోవాలని ప్రయత్నించాను. మరి నాది మాత్రం తప్పుకాదా, ఎందుకు చెప్పలేదంటావేమో, సరైన సమయం కోసమే నేనూ ఎదురు చూస్తున్నాను. నన్ను క్షమించు శశీ.''

ఏంచేస్తాడోనని ఆతృతగా ఎదురు చూస్తున్న శశికి, ఇలా తన తప్పు కూడా ఒప్పుకోవడంతో, అనుకోని సంతోషం కల్గింది. అతను బాధపడకూడదని ''ఇందులో మీరు చేసిందేముందండీ, మన భవిష్యత్తు ఏమిటో తెలియనప్పుడు అలా ప్రవర్తింథాం, నాకు ముందు జీవితంలో, మీరు, మీ ముందు జీవితంలో నేను తటస్థ పడతామని తెలిస్తే ఇలా జరిగేది కాదు. అది ఒక పీడకలలా మర్చిపోవాలి అంతే. నిజంగా మీ లాంటి సహృదయులు, నాకు భర్తగా దొరకటం నా అదృష్టం'' మనస్ఫూర్తిగా అంది శశి.

''మరి నీ లాంటి క్షమా హృదయం నాకు లభ్యం అవటం నా అదృష్టంకాదూ'' చిలిపిగా అంటున్న సుధాకర్‌ని చూసి, అందంగా సిగ్గుపడింది శశి. మనసులో ఇన్నాళ్లు రగులుతున్న బాధ తీరిపోగా.

ఆ క్షణంలో శశికి — సుధాకర్‌కి అనేక కాలేజి డ్రామాల్లో ఉత్తమ నటుడిగా బహుమతి అందిన విషయం గుర్తు రాలేదు.

స్తా, మరోసారి కల్సుకుందాం" సుషమ పిలుస్తున్నా వినిపించుకోకుండా, గబగబా నడిచి సుధాకర్ ప్రక్కకి వచ్చింది.

"అదేమిటి? అప్పుడే అయిపోయాయా కబుర్లు — ఇంకెంతసేపు ఇలా గడుస్తుందో అనుకున్నా — అన్నట్లు ఇంటికి పిలిచావా"

"ఆఁ ఎంతసేపు మాట్లాడుకున్నా తరగని కబుర్లు ఉంటూనే ఉంటాయి. అందుకని ఇంటికి పిలవలేదు పిలవచ్చు, లెండి, ఇక్కడేగా ఉండేది — మళ్ళీ కలవకుండానే ఉంటామా" సంభాషణ ఆపు చేస్తున్నట్లుగా అంది శశి.

* * *

పనంతా ముగించుకొని, చేతులు తుడుచుకొని, బయటికి వస్తున్న శశి, పడక్కుర్చీలో పడుకొని నవ్వుకుంటున్న సుధాకర్‌ని చూస్తూ అడిగింది.

"ఏమిటి? మీలో మీరే నవ్వుకుంటున్నారూ"

"ఏంలేదు—అదే మీ ఫ్రెండు, రోడ్డు మీద పలకరించటం, ఆ చొరవ చూసి".

"అదా" ముఖం చిట్లించింది శశి.

"మొత్తానికి భలే తమాషా అయినపిల్ల సుమా" పడక్కుర్చీ లోంచి లేస్తూ అన్నాడు సుధాకర్.

"ఇక్కడే ఉంటుంది గొడవ. ఇంక సుషమ—అవునూ ఆ పెళ్ళయి భర్తతో వచ్చినది ఇంక ఇక్కడ ఉండక ఎక్కడుంటుంది? కాని తమ స్నేహం త్రుంచేయటమా, మానటమా? ఒకవేళ స్నేహం పొడిగించి రాకపోకలు సాగిస్తే — అమ్మో — ముందు ముందు ఏమవుతుందో — పోనీ ఆపేద్దాం అంటే ఎలా?" తనలోతాను ఆలోచిస్తూ టేబిలు ముందరున్న కుర్చీలో కూర్చుంది శశి.

"ఏమిటి ఆలోచన. మీ ఫ్రెండు గురించే, ఇక మీరిద్దరూ కలిస్తే నన్ను సుషమ ... ఆకతాయిపిల్ల. చంచలమైన మనస్తత్వం. పెళ్ళి నిశ్చయమయిపోయిన దగ్గర్నుంచి తమ స్నేహం త్రుంచేసే ప్రయత్నాల్లోనే ఉంది తను. ఇందుకు కారణం — కేవలం సుషమా? తనకు ఉన్నభయం కాదూ?"

"వ్చ్" నిట్టూర్చింది శశి.

"ఏమిటి స్నేహితురాలి విరహం భరించలేకున్నావా?"

నవ్వి లేచింది శశి.

* * *

"ఇవాళ మీ ఫ్రెండు కన్పించింది."

"ఉహూ" ఏ మాత్రం ఆసక్తి లేని ఆ ప్రవర్తన చూసి కొద్దిగా ఆశ్చర్యపడ్డాడు సుధాకర్.

"వాళ్ళ ఇంటి అడ్రస్ ఇచ్చి రమ్మంది మనల్నోసారి"

"ఆహా" మామూలుగా అంది శశి.

సుషమ ప్రస్తావన వచ్చినప్పుడల్లా శశిలో మార్పు గమనిస్తూనే ఉన్నాడు. సుధాకర్.

"ఏమయి ఉంటుందబ్బా కారణం" ఎంత ఆలోచించినా అంతుబట్టలేదు ఆతనికి.

మొన్నొకసారి అంతే. బట్టలకొట్లో చీరలు చూస్తున్న శశి, సుషమ షాప్‌లోకి రావటం చూసి గబగబా యివతలికి వచ్చేసింది. కాని సుషమ ఒదలలేదు. "హాయ్ శశీ, బట్టలు ఖరీదు చేయటానికి వచ్చావా? అయిపోయిందా వెళ్ళుతున్నావు?" అడగనే అడిగింది.

"లేదులే మరోసారి వద్దామని, వస్తాము ఇంకా చాలా పనుంది బయట."

చిన్నబుచ్చుకొని చూస్తున్న సుషమను చూసి, బయటకు వచ్చాక అడిగాడు తను.

"అదేమిటి శశీ, పాపం తనేమనుకుంటుంది"

"ఏమిటో నాకు మాట్లాడాలనిపించ చాల్సిన పనముంది"

"అయితే ఎప్పుడు వెళ్దాం"

"వెళ్దాంలెండి, తొందరేముంది. ఒక ఊళ్ళో ఉండేవాళ్ళమేగా ఎప్పుడయినా వెళ్ళొచ్చు." లోపలికి వెళ్ళబోయింది శశి.

* * *

సుషమది ఎంత చంచలమయిన స్వభావం అయినా తమ ప్రాణ స్నేహానికి అడ్డు రాలేదు. సుషమ గురించి సుధాకర్ పట్ల తనకు భయంలేదు. సుధాకర్ మనసు తనకు తెల్సు. సుషమ పెళ్ళయ్యాక మారకుండా ఉంటుందా? చిన్నతనపు చిలిపి చేష్టలు పెళ్ళి అయ్యాక మానివేసే ఉంటుంది. అలాగని స్నేహం సాగిస్తే, పాత వ్యక్తులు కలిస్తే, పాత సంగతులు వెలికి రాకుండా ఉంటాయా? అప్పుడు — ఏ మగవాడయినా, తన భార్య పూర్తిగా తన సొత్తు అనే అనుకుంటాడు. ఎంత మంచి మనసున్నా. ఇలాంటివి తేలిగ్గా తీసి పారవేసే హృదయ వైశాల్యం ఎందరిలో ఉంటుంది? అతన్ని మభ్య పరచాలని తనకు లేదు. ఎన్నిసార్లు చెప్పాలని ప్రయత్నించలేదు ఎప్పటికయినా చెప్పేతీరాలి — తన మనసులో భారం మోయలేదు.

ఆలోచిస్తూనే పన్లు ముగించుకొని, సుధాకర్ దగ్గరకు వచ్చింది శశి.

"పన్లన్నీ అయినట్లేనా" సాలోచనగా అడిగాడు సుధాకర్.

"ఆఁ ఏం" నవ్వుతూ అతని ప్రక్కగా వచ్చి కూర్చుంటూ అంది శశి.

"నే నొకటి అనుగుతాను చెప్తావా?"

"ఏమిటది?" భయపడ్తూనే అడిగింది.

"స్నేహితురాలు కనిపిస్తే పల్కరించటం, పల్కరించక పోవటం నీ ఇష్టం అనుకో, కాని తన ప్రస్తావన వచ్చినా, తను ఎదురైనా, నీలో ఏదో మార్పు నాకు గోచరిస్తోంది. ఎందుకీ మార్పు ఏమిటది తుంది. ఆ భావాన్ని, గతాన్ని పూర్తిగా తొలగించాలంటే పరిష్కారం ఇదే.

"చూడు శశీ, నేనూ నీకు ఒకటి చెప్పాలి. అది నాకు ఉషకు ఉన్న స్నేహం దాదాపు మాది ఇంతేననుకో. పెళ్ళి దాకా కూడా వచ్చాం. నా కంటే బాగా, డబ్బు, హోదా ఉన్న వరుడు దొరకగానే, తనని మర్చిపొమ్మంది. అలాంటి చంచల స్వభావిని నమ్మినందుకు నేను పశ్చాత్తాప పడ్డాను. గతాన్ని మర్చిపోవాలని ప్రయత్నించాను. మరి నాది మాత్రం తప్పుకాదా, ఎందుకు చెప్పలేదంటావేమో, సరైన సమయం కోసమే నేనూ ఎదురు చూస్తున్నాను. నన్ను క్షమించు శశీ."

ఏంచేస్తాడోనని ఆతృతగా ఎదురు చూస్తున్న శశికి, ఇలా తన తప్పు కూడా ఒప్పుకోవడంతో, అనుకోని సంతోషం కల్గింది. అతను బాధపడకూడదని "ఇందులో మీరు చేసిందేముందండీ, మన భవిష్యత్తు ఏమిటో తెలియనప్పుడు అలా ప్రవర్తించాం, నాకు ముందు జీవితంలో, మీరు, మీ ముందు జీవితంలో నేను తటస్థపడతామని తెలిస్తే ఇలా జరిగేది కాదు. అది ఒక పీడకలలా మర్చిపోవాలి అంతే. నిజంగా మీ లాంటి సహృదయులు, నాకు భర్తగా దొరకటం నా అదృష్టం" మనస్ఫూర్తిగా అంది శశి.

"మరి నీ లాంటి క్షమా హృదయం నాకు లభ్యం అవటం నా అదృష్టం కాదూ" చిలిపిగా అంటున్న సుధాకర్‌ని చూసి, అందంగా సిగ్గుపడింది శశి. మనసులో ఇన్నాళ్ళు రగులుతున్న బాధ తీరిపోగా.

ఆ క్షణంలో శశికి — సుధాకర్‌కి అనేక కాలేజి డ్రామాల్లో ఉత్తమ నటుడిగా బహుమతులు అందిన విషయం గుర్తు రాలేదు.

## పదమూడున్నరడుగుల పాము

ధర్మపురిలో ఊరవతలడప్పోంచో పాము తన తల బయటికి పెట్టి అటూ యిటూ చూసి బయటికి వచ్చిందట. ఆ పాము పదమూడున్నర అడుగులు పొడవుందట యిది చూసి ఆశ్చర్యపోయిన వారిలో ధైర్యం వున్నవాళ్ళా పాముని పట్టుకుంటే ప్రభుత్వ అటవీశాఖవారు పామును ..., దాన్ని దాచేశారట. ఊరు ఊరంతా ఆ ... చూడ్డానికి విరగపడ్డారట ఊరు విరగబడ్డానికో కారణమే అక్కర్లేదుకదా!

## పసిపిల్లని నీటముంచి చంపిన మేనమామ!

మద్రాసులో నివసిస్తున్న నారాయణస్వామి భార్య తమ్ముడు ఆరుముగం చిన్నప్పటినుంచీ వారితోనే వుంటున్నాడట నారాయణస్వామి పెద్దగా లేనివాడైనా 23 ఏళ్ళ ఆరుముగాన్ని భరించాడట ఆతనికి సుమతి అనే అమ్మాయి పుట్టిన దశ ఎత్తుకొని ఆ పిల్లకు నాలుగేళ్ళు వచ్చేసరికి చక్కని స్థితికొచ్చాడట ఆరుముగాన్ని 23 ఏళ్ళు పెంచాక యిహ నువ్వు నీ కాళ్ళమీద నిలబడాలి సంపాదన నువ్వు మానుకోవాలి ఇలా ఎన్నాళ్ళని వుంటావు అని అనేవాడట సుమతిపుట్టాక తనకు కష్టాలు పుట్టాయని కనుక ఆ పిల్లను చంపేయాలని ఆరుముగం నిశ్చయించేసుకున్నాడట ఏదో పండుగకు నారాయణస్వామి భార్య తన పిల్లలతో పుట్టిల్లు వెణ్ణాంగుపట్టుకు వెళ్ళిందట. ఆరుముగం ఆమెతో కూడా వెళ్ళి ఆ రాత్రి అమ్మమ్మ పక్కలో పడుకున్న సుమతిని తీసుకుని ఊరు చివరికిపోయి అక్కడో కొలనులో విసిరివేశాడట ఆ కొలనులో నీళ్ళు ఎక్కువ లేనందువల్ల సుమతి నీళ్ళలో నించుని 'అమ్మా అప్పా అని ఏడుపు ప్రారంభించిందట దాంతో ఆరుముగం ఆ కొలనులో దిగి ఆ పసి పిల్లను నీళ్ళలో మునిగేలా తలనొక్కి చంపేశాడట.



## అన్ని పడవలూ నటీమణులకే!

బెస్తవారికి చేపలు పట్టుకోడానికి పడవలు [మోటారు వున్నవి] యిస్తామంటూ పోయిన తమిళనాడు ప్రభుత్వం బల్ల మోటారు పడవలను తయారు చేయించి అవన్నీ కె ఆర్. విజయ, ప్రమీల, షావుకారు జానకి, పద్మిని వంటి సినిమా హీరోయినులకు యిచ్చిందని తమిళనాడు సభలో మార్క్సిస్టు కమ్యూనిస్టుకు చెందిన గోవిందరాజన్ కరుణానిధి మీద నిష్ఠూరం వేశారట ఈ పడవలు బెస్తవారికి చేరనేలేదని ఆయనన్నారట.

## ఒకే యింట్లో ఉంటాము

నటి మంజుల ప్రేమించి వివాహం చేసుకున్న తమిళనటుడు విజయకుమార్‌కు పెళ్ళాం ముగ్గురు పిల్లల తండ్రట కవిక్కుయిల్ అనే సినిమా షూటింగు టైములలోని తీరిక వేళలో ప్రేమ కుదిరి, ముదిరిందట. తాను తనభర్త, ఆతని భార్యా పిల్లలతో అదే యింట్లో వుండ తీర్మానించుకున్నట్టు మంజుల తెలియజేశారట.

## నిరాశ – ఆత్మహత్య

ధర్మపురిలోని రాష్ట్రప్రభుత్వ ఆరోగ్య శాఖలో పని చేస్తున్న కృష్ణరాజ్ అనే అతనికి మూన్నెళ్ళ క్రితం వివాహమయ్యిందట. పెళ్ళయి మూడు నెలలయినా ఆతను భార్యని తీసుకు వెళ్ళక సేలంలో వున్న తన తల్లి వద్దనే వుంచాడట వివాహమై అత్తగారితోనే కాపురం చేస్తున్న ఆతని భార్య 29 ఏళ్ళ ఇంద్రాణి ఏ ముచ్చటా తీరలేదని, సినిమాకయినా మొగుడితో వెళ్ళే అదృష్టమే లేదని నిరాశపడి, కిరసనాయిలు మీద పోసుకుని, ఒంటికి నిప్పంటించుకొని చనిపోయిందట.




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**


SALOFEN
ANALGESIC TABLET
SALOFEN
TS

# గోడలకు కూడా చెవులుంటాయి



## వాటిని రంజింపజేసే రంగుల రాగం

## ఏప్‌కోలైట్ సూపర్ ఎక్రిలిక్ ఎమల్షన్!

ఈ రంగు రంగుల
రాగాలతో
గోడలను పాడించండి.




ఉత్తమ గృహాల
సర్వోత్తమ
సౌందర్యానికి

**ఏషియన్ పెయింట్స్**